


తిరుమల తిరుపతి దేవస్థానములు

# సప్తగిరి

సచిత్రమాసపత్రిక

జూన్ 2016 వెల రూ.5/-

వేదం పై
ప్రత్యేక వ్యాసాలతో...

మచ్చరమున మరి యంబుధి జొచ్చిన
సోమకు ద్రుంచియు, విచ్చలవిడి
వేదంబులజునకునిచ్చితివో మత్స్యావతార



**15-05-2016 నుండి 17-05-2016 వరకు**
**తిరుమలలో జరిగిన**
**శ్రీ పద్మావతీ శ్రీనివాసుల పరిణయ మహోత్సవం**

# వేదములే శిలలై వెలసినది కొండ

కట్టెదుర వైకుంఠము కాణాచయిన కొండ
తెట్టెలాయ మహిమలే తిరుమలకొండ ॥

వేదములే శిలలై వెలసినది కొండ
యేదెసఁ బుణ్యరాసులే యేఱులైనది కొండ
గాదిలి బ్రహ్మదిలోకముల కొనల కొండ
శ్రీదేవుఁ డుండేటి శేషాద్రి యీ కొండ

సర్వదేవతలు మృగజాతులై చరించే కొండ
నిర్వహించి జలధులే నిట్టచరులైన కొండ
వుర్విఁ దపసులే తరువులై నిలిచిన కొండ
పూర్వపు టంజనాద్రి యీ పొడవాటి కొండ

వరములు కొటారుగా వక్కాణించి పెంచేకొండ
పరుగు లక్ష్మీకాంతు సోబనపుఁ గొండ
కురిసి సంపదలెల్ల గుహలనిండిన కొండ
విరివైన దిదివో శ్రీ వేంకటపుఁ గొండ

(సంపుటం 3 - సంకీర్తన 471)



కట్టెదుట కన్పించే వైకుంఠమే ఈ వేంకటాచలం. ఇక్కడి తేనెతెట్టెలన్నీ మహిమలే! వేదాలే శిలలై వెల్గుతున్నాయిక్కడ. బ్రహ్మదిలోకాలకు చివరిది ఈ కొండ. శ్రీదేవుడుండేది శేషాద్రి ఈ కొండ. సకలదేవతలు మృగజాతులై సంచరిస్తారిక్కడ! సముద్రాలే సానువులయింది - ఈ కొండ. మునుపటి అంజనాద్రే ఈ పొడవైన కొండ. వరాలు అధికంగా పెంచేదీ కొండ. లక్ష్మీకాంతునిసుఖాలకు నిలయం - ఈ కొండ. సంపదలు పుష్కలంగా ఉండే గుహలు - ఈ కొండ. చాలా విశాలమైంది - ఈ కొండ.






## సర్వాంగసుందరం

శ్రీవారిమానసపుత్రిక అయిన 'సప్తగిరి' ప్రతినెలా అపురూపమైన ఛాయాచిత్రాలతో విశేషంగా మమ్మల్ని ఆకట్టుకుంటున్నది. ముఖ్యంగా కవరు పేజి, చివరిపుట సర్వాంగ సుందరంగా ఉండి ప్రతినెలా మమ్మల్ని వాటిని భద్రపరచుకునేటట్లు చేస్తున్న సంపాదకవర్గానికి, యాజమాన్యానికి కృతజ్ఞతలు.

– ఎల్. లక్ష్మీపతి, విజయవాడ.

## అక్షరసత్యం!

మనందరి సప్తగిరి మాసపత్రిక దినదినాభివృద్ధి చెందుతూ మూడుపువ్వులు, ఆరుకాయలుగా వెలుగొందుతూ, భక్తులకు చక్కటి ఆధ్యాత్మికజ్ఞానాన్ని కలుగజేస్తున్నది. సప్తగిరి సంపాదకీయాలలోని విషయాలు అక్షరసత్యాలు.

– జి.భారతి, చంద్రగిరి.

## కన్నులపండుగ..

ప్రతినెలా సప్తగిరి మాసపత్రిక ముఖచిత్రాలు ఎంతో కన్నులపండుగగా ఉంటున్నాయి. వీటితో పాటు మధ్యపేజీలో అందించే వర్ణచిత్రాలు మామనసుల్ని ఆహ్లాదపరుస్తున్నాయి. ప్రతినెలా కలియుగ వైకుంఠమైన తిరుమలకు వచ్చినంత అనుభూతి మీ పత్రిక మాకు అందగానే కలుగుతుంది. మే నెల సప్తగిరి రామానుజుడి విశేషసంచికగా వెలువడడం బాగుంది. రామానుజుడిగురించి అనేకవిషయాలు మాకు తెలిసాయి.

– ఎన్.ప్రసూన, పాలకొల్లు.

## ఆసక్తిదాయకం!

మాకు ఏడుకొండలస్వామికి సంబంధించిన అనేక విషయాలు ఈ సప్తగిరిపత్రికవల్లే తెలుస్తున్నాయంటే, అది ఎంతమాత్రమూ అతిశయోక్తికాదు. పత్రికలోని అన్ని అంశాలు ఆసక్తిదాయకంగా ఉన్నాయి. స్వామివారివర్ణచిత్రాలను చూస్తుంటే మాకు స్వామిని ప్రత్యక్షంగా చూసిన అనుభూతి కలుగుతోంది.

– జి.కామాక్షి, కాకినాడ.

## భక్తిరసప్లావితం

సప్తగిరిపత్రిక అందిన రోజు ఆ వేంకటేశ్వరస్వామే మా ఇంటికి వచ్చిన అనుభూతి కల్గుతోంది. మొదటిపుటనుంచి చివరిపుటవరకు భక్తిరసప్లావితమైన అక్షరాలను భక్తిరసంలో ముంచి ప్రతినెలా సప్తగిరి పత్రికను అందిస్తున్నారు. అటు పాఠకలోకానికి, ఇటు లోకకల్యాణానికి పత్రిక పనిచేస్తున్నది.

– బి.పోతురాజు, రైల్వేకోడూరు.

## అద్దంపట్టేలా...

సప్తగిరి మాసపత్రికలో వచ్చే ప్రతిశీర్షిక ఆధ్యాత్మికతకు అద్దం పట్టేలా ఉంది. పిల్లల నుంచి పెద్దలవరకు అందరిలో ఆధ్యాత్మికఅవగాహన పెంపొందించేలా వ్యాసాలు తీర్చిదిద్దుతూ, మమ్మల్ని ఏదో దివ్యలోకానికి తీసుకెళ్లుతున్నట్లు ఉన్నందుకు మీకు కృతజ్ఞతలు.

– పి.మురళీకృష్ణ, హైదరాబాదు.

## 2016 జూలై నెల ఉత్సవాలు, పర్వదినాలు

| | |
|---|---|
| 08 | శ్రీనివాసమంగాపురం, సాక్షాత్కార వైభవోత్సవం ప్రారంభం |
| 10 | శ్రీగోవిందరాజస్వామివారి పుష్పయాగం,<br>శ్రీనివాసమంగాపురం సాక్షాత్కార వైభవోత్సవం సమాప్తి |
| 15 | శ్రీగోవిందరాజస్వామివారి జ్యేష్ఠాభిషేకం ప్రారంభం |
| 16 | ఆణివర ఆస్థానం, కపిలతీర్థం పవిత్రోత్సవం ప్రారంభం. |
| 17 | శ్రీగోవిందరాజస్వామివారి జ్యేష్ఠాభిషేకం సమాప్తి |
| 18 | కపిలతీర్థం పవిత్రోత్సవం సమాప్తి |
| 19 | వ్యాసపూర్ణిమ |
| 20 | ఆండాళ్ ఉత్సవం ప్రారంభం |
| 29 | శ్రీకోదండరామస్వామి పవిత్రోత్సవం ప్రారంభం |

తిరుమల తిరుపతి దేవస్థానముల సచిత్ర మాసపత్రిక

# సప్తగిరి

సంపుటి : 47 జూన్, 2016 సంచిక : 01



వేంకటాద్రిసమం స్థానం
బ్రహ్మాండే నాస్తి కించన।
వేంకటేశసమో దేవో
న భూతో న భవిష్యతి॥

## ఈ నెలలో....



ముఖచిత్రం : వేదోద్ధారక గోవిందా!
వెనుకచిత్రం : వేదం బ్రహ్మమయం

గౌరవ సంపాదకుడు
డా॥ డి. సాంబశివరావు, ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి, తి.తి.దేవస్థానములు.

పర్యవేక్షకుడు
శ్రీ ఎన్.ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్.(విశ్రాంత),
ప్రత్యేకాధికారి, ప్రాజెక్టులు, తి.తి.దే.

ప్రచురణకర్త-ప్రధాన సంపాదకుడు
డా॥ సి.శైలకుమార్

సంపాదకుడు
డా॥ కె.రాధారమణ

ఉపసంపాదకుడు
డా॥ కంపల్లె రవిచంద్రన్

ముద్రాపకుడు
శ్రీ వి.వీరబ్రహ్మయ్య, ఎం.ఏ., బి.ఇడి.,
ఉపకార్యనిర్వహణాధికారి(ప్రచురణలు & ముద్రణాలయం),
తి.తి.దే., తిరుపతి

వర్ణ చిత్రపుటలు
శ్రీ పి.శివప్రసాద్

రూపకల్పన
శ్రీ బి.గురుకుమార్ రెడ్డి

సప్తగిరి మాస పత్రిక

విడి ప్రతి : రూ. 5/-
సం॥ చందా : రూ. 60/-
జీవిత చందా : రూ. 500/-
విదేశాలకు సం॥చందా : రూ. 850/-





స్థలాభావం వల్ల 'పరమయోగి విలాసం' ధారావాహిక ప్రచురించలేకపోతున్నాం. పాఠకులు గమనించగలరు.




# 'వేదసమృద్ధిరస్తు'

మన సంప్రదాయంలో మంగళాచరణంలో భాగంగా పెద్దలు దీవించేవారు. అందులో – దేశం, సమాజం – పాడిపంటలతో, సుఖశాంతులతో వర్థిల్లాలని ఆశీర్వదించే వారు. దానితోపాటు – తరతరాల – యుగయుగాల – జ్ఞానమయ కోశమైన వేదంకూడా సమృద్ధంగా వర్థిల్లాలని శుభాశీస్సులు ఇచ్చేవారు.

భగవంతుడైన శ్రీనివాసుడు తొల్లిట మత్స్యావతారంలో, వేదాలను దొంగిలించుకుపోయి సముద్రగర్భంలో దాగిన సోమకాసురుణ్ణి సంహరించి తిరిగి వేదసముదాయాన్ని బ్రహ్మకు అందించాడు, ఆ బ్రహ్మ నుంచి పరంపరగా వేదం కొనసాగుతోంది.

వేదాన్ని మన ప్రాచీనులు శబ్దంగా మాత్రమే చూడలేదు. ప్రతి శబ్దానికి స్వరాలను – ఉదాత్త, అనుదాత్త, స్వరితాలను– చేర్చి భద్రపరచడం వల్ల ఈనాటికీ అదే రూపంలో కాలదోషం లేకుండా వేదాలు కొనసాగుతున్నాయి. అంటే ఇప్పుడు మనం వినే వేదఘోష కొన్ని యుగాలకు పూర్వంకూడా అలాగే ఉండేదన్నమాట. ఇది మనకి గొప్ప గర్వకారణం కదూ! ఇంతటి వేదవాఙ్మయానికి వారసులం అయినందుకు ఒక జాతిగా మన హృదయపతాకాలు ఆకాశమంతఎత్తులో రెపరెపలాడతాయి.

వేదం భారతీయుల జ్ఞానభాండారం. అపౌరుషేయంగా అందిన విజ్ఞాన సాగరం. కుల, మత, వర్గ, వర్ణాలకు అతీతంగా మానవులు సుఖంగా, శాంతిగా జీవించటానికి కావలసిన అన్ని విషయాలు వేదంలో ఉన్నాయి. కుటుంబజీవనం దగ్గర నుంచి, ప్రకృతిని కాపాడుకోవడం దగ్గరనుంచి, వైజ్ఞానిక విషయాలు, ఆరోగ్యరహస్యాలు ఇలా అన్నీ వేదంలో ఉన్నాయంటే అది అతిశయోక్తి ఏమాత్రం కాదు. ఈనాడు సాంకేతికంగా కనుగొనబడిన ఎన్నో నూతనవిషయాల ప్రస్తావన వేదంలో ఉంది.

నిజానికి మన మహర్షులు కొన్ని వేల సంవత్సరాల భావి జీవితాన్ని, మానవ ప్రగతి వికాసాన్ని ముందే ఊహించారు. నేడు మనం ఎలా జీవిస్తే సుఖంగా ఉంటామో వారు ఆనాడే నిర్దేశించారు. కాని, అది మనం తెలుసుకోవడం లేదు, ఆచరించడం లేదు. అందుకే నిత్యం అశాంతిగా బ్రతుకుతున్నాం. తెలియని వేగంలో కొట్టుకుపోతున్నాం. వేదం తెలుసుకుంటే నైతికంగా, కుటుంబపరంగా, సమాజపరంగా మనం ఎలా జీవించాలో తెలుస్తుంది. అది విశ్వశాంతికి మూలం అవుతుంది.

అందుకే వేదంలో ఏముందో తెలుసుకొనే ప్రయత్నం చేద్దాం!

అందులో భాగంగా ఈ నెల **'సప్తగిరి'** ని వేదాలకు సంబంధించిన ప్రత్యేకవ్యాసాలతో మీముందుకు తీసుకువస్తున్నాం. అపారజలరాశిని మరచెంబులో తెచ్చినట్లు వేదాలలోని ముఖ్యమైనవిషయాలను సామాన్యపాఠకులకు అర్థమయ్యే రీతిలో చిన్న చిన్న వ్యాసాలుగా ముద్రించాం. ఆదరిస్తారని నమ్ముతున్నాం.

**వేదవేద్యుడైన శ్రీవేంకటేశ్వరుని ఆశీస్సులు అందరికీ లభించాలని కోరుతున్నాం.**

# వేదపరిచయం

- కె. పురుషోత్తమాచార్యులు




**భారతీయుల ఆధ్యాత్మికతకు, ఆదర్శజీవనానికీ సాంస్కృతికఉజ్జీవనానికి మూలాధారం 'వేదం'. మంత్రద్రష్టలైన మహర్షులు ఆవిష్కరించిన మహిమాన్వితశబ్దరాశి. ఈ శబ్దరాశి సాక్షాత్తు పరమపురుషనిశ్వాసమే అని మన విశ్వాసం. అలాంటి వేదాల గురించి పరిచయం చేయటానికే ఈ వ్యాసం....**

**'వేద'** మనే సంస్కృతశబ్దం 'విద్' అనే ధాతువు నుంచి ఏర్పడింది. ధర్మార్థకామమోక్షాలనే 4 పురుషార్థాలను తెలియచేసేశబ్దరాశి వేదం. జ్ఞానోపదేశకం.

ప్రారంభంలో ఋక్కులు, యజుస్సులు, సామలు కల గలసి ఏకరూపంగానే వేదాన్ని అధ్యయనం చేసేవారు. ఇలా ఏకరూపంగా ఉన్న శబ్దరాశిని, వ్యాసమహర్షి ఋగ్యజుస్సామా థర్వణాదివేదాలుగా విభజించాడు.

ప్రతివేదమూ సంహిత, బ్రాహ్మణం, ఆరణ్యకం, ఉప నిషత్తులు అనే నాల్గుభాగాలు కలిగి ఉంటుంది. వీటిలో సంహితాభాగం ప్రధానంగానూ- బ్రాహ్మణం, ఆరణ్యకాలు వీటికి సహకారంగానూ ఉంటాయి. ఉపనిషత్తులు ఆత్మ, జీవుడు, మోక్షం మొదలైనవిషయాలను చర్చిస్తాయి.

## సంహితలు

సమ్మిళితంగా ఉన్న వేదరాశి విభాగానుగుణంగా ఋక్సంహిత, యజుస్సంహిత, సామసంహిత, అథర్వసంహి తలుగా కూర్చబడింది. సంహిత అంటే కూర్పు అని అర్థం. అక్షరాలను ఆనుపూర్విగా(వరుసగా) ఉచ్చరించడమే సంహిత- **వర్ణానాం ఏకప్రాణయోగః సంహితా** అని చెప్పబడి ఉంది. వ్యాసమహర్షి పైల వైశంపాయన జైమిని సుమంతులనే నలు గురు శిష్యులకు ఈ నాలుగు సంహితలను ఉపదేశించారు.

## బ్రాహ్మణం

యజ్ఞయాగాదులలో వాడుకునేందుకు వీలుగా ఉన్న మంత్రభాగానికి వ్యాఖ్యానరూపమే బ్రాహ్మణం. ఇవి ఆయా యాగాలను, వాటిస్వరూపాన్ని వివరిస్తున్నాయి. అన్ని వేదశాఖ లకు బ్రాహ్మణగ్రంథాలు ఉండేవి. కాలప్రభావంవల్ల చాలా వేదశాఖలతోపాటు, బ్రాహ్మణగ్రంథాలుకూడా లోపించాయి.

## ఆరణ్యకాలు

ఆరణ్యకాలు బ్రాహ్మణభాగానికి కొన సాగింపుభాగాలు అనవచ్చు. బ్రాహ్మణభాగానికి ఉపనిషద్భాగానికి సంబంధం కల్పించడంలో ఈ ఆరణ్యకాలు ప్రధాన భూమికలు. యజ్ఞాల్లోని రహస్యాలను మహర్షులు అరణ్యాల్లో చర్చించారు. అందుకనే **అరణ్యే పాఠ్యత్వాత్ ఆరణ్యకం** - అని వీటికి పేరు వచ్చింది. వేదంలో పూర్వభాగమైన మంత్ర బ్రాహ్మణాలలోని కర్మకాండ, వేదాం తంగా ప్రసిద్ధిచెందిన జ్ఞానకాండకూడా ఈ ఆరణ్యకభాగాలలో మనకు కనిపిస్తుంది. మహర్షులచర్చలసారమే ఈ ఆరణ్యకా లలో గోచరిస్తుంది.

## ఉపనిషత్తులు

వేదానికి చివరిభాగాలుగా ఉపనిషత్తులు పేర్కొన బడ్డాయి. ఇవి ప్రధానంగా జ్ఞానకాండలో ప్రతిపాదించబడిన బ్రహ్మతత్త్వాన్ని గురించిన విషయాలను తెలియజేస్తున్నాయి. ఇవి 108 గా గుర్తించబడినా పది ప్రధానమైనవి. అవి-

**ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తిత్తిరాః, ఐతరేయం చ ఛాందోగ్యం బృహదారణ్యకం దశ.**

## ఋగ్వేదం

నాలుగువేదాలలో మొదటిది ఋగ్వేదం. ఋక్కుల సముదాయమే ప్రధానంగా కలది. 'ఋక్' అనే శబ్దానికి స్తోత్రం, వేదస్తుతి అని అర్థం. ఇంద్రుడు మొదలైనదేవతలను ఈ వేదం స్తుతిస్తుంది. యజ్ఞాలలో ఆవాహన చేసే (పిలిచే) దేవతలను స్తోత్రం చేయడానికి ఈ ఋక్కులు ఉపయోగించబడతాయి. యజ్ఞాల నిర్వహణలో అక్కడక్కడ చెప్పబడ్డ ఋక్కులను ఒక్క చోట కూర్చారు. ఆ కూర్పును **'ఋక్సంహిత'** అన్నారు.

ఋక్సంహిత మండలాలుగా, మండలాలు సూక్తా లుగా, సూక్తాలు ఋక్కులుగా విభజించబడ్డాయి. ఋగ్వేదంలో పదిమండలాలు ఉన్నాయి. ఋక్సంహితకు ఇంకొక విధమైన విభాగంకూడా ఉంది. దీనిప్రకారం సంహితలో 64 అధ్యాయాలు ఉన్నాయి. ఈ అధ్యాయాలను అష్టకాలుగా విభజిం చారు. అష్టకం అంటే ఎనిమిది అధ్యాయాల

**ప్రతి వేదమూ సంహిత, బ్రాహ్మణం, ఆరణ్యకం, ఉపనిషత్తులు అనే నాల్గుభాగాలు కలిగి ఉంటుంది.**

సముదాయం. అంటే ఋగ్వేదంలో ఎనిమిది అష్టకాలు ఉన్నాయి. ఇప్పుడు ఎక్కువగా అధ్యయనం చేయబడుతున్న శాకల శాఖలో మొత్తం 1028 సూక్తాలు (10,552 ఋక్కులు) ఉన్నాయి.

ఋగ్వేదంలో ఇంద్ర, అగ్ని, సోమ, అశ్వినీదేవతలు, మరుత్తులు, వరుణుడు, ఉషస్సు, సూర్యుడు, సవిత, పూష, విష్ణు, బృహస్పతి, రుద్రుడు, యముడు, ద్యావాపృథువులు (భూమి ఆకాశములు) ముఖ్యమైన దేవతలుగా స్తుతించబడ్డారు. అలాగే మరుత్తులకు తండ్రియైన వాయుదేవుడు, విశ్వకర్మయైన త్వష్ట, దేవతలతల్లి అదితి, రాక్షసులతల్లి దితి, మేఘదేవత పర్జన్యుడు మొదలైనవారుకూడా స్తుతింపబడ్డారు.

ప్రపంచప్రసిద్ధులైన తాత్త్వికులెందరికో ఆశ్చర్యం కలిగించిన 'నాసదీయసూక్తం' ఋగ్వేదంలోనిది. ఈ సూక్తం ప్రపంచోత్పత్తిని తెలుపుతుంది. సృష్టిగురించి చెప్పిన పురుషసూక్తం ఋగ్వేదంలోనిదే. విశ్వోత్పత్తి, జీవోత్పత్తి, బంధమోక్షాలు, ప్రకృతిరహస్యాలు, వివాహబంధం, ఏకపత్నీవ్రతం, స్త్రీలను గౌరవించడం, ఆశ్రమవ్యవస్థ, పునర్జన్మ, ఆయుర్వేదవిజ్ఞానం మొదలైన ఆశ్చర్యకరవిషయాలెన్నో ఋగ్వేదంలో ఉన్నాయి.

## యజుర్వేదం

సమాజఅభ్యుదయంకోసం యజ్ఞాలు ఆచరించడం, ఆధ్యాత్మికఔన్నత్యాన్ని సాధించడం, భౌతికవిజ్ఞానం, గణితం మొదలైనవిషయాలు యజుర్వేదంలో ఉన్నాయి.

దేవతలను పూజించడానికి, దేవతలకు హవిస్సులను సమర్పించడానికి ఉపయోగించే మంత్రమే యజుస్సు. ఇటువంటి మంత్రాలతో కూడినవేదమే యజుర్వేదం. ఈ వేదమంత్రాలు ఋగ్వేదమంత్రాలలాగా ఛందోబద్ధంగాను, సామవేదంలాగా పాడడానికి అనుకూలంగా ఉండవు. గద్యరూపంలో ఉంటాయి.

ఋగ్వేదమంత్రాలతో స్తోత్రం చేయబడినదేవతలను పూజించి, వారికి హవిస్సులు సమర్పించడానికి యజ్ఞాలలో యజుర్వేదమంత్రాలు ఉపయోగపడతాయి. యజుర్వేదం రెండు భాగాలు. 1) కృష్ణయజుర్వేదం, 2)శుక్లయజుర్వేదం. దక్షిణ భారతంలో కృష్ణయజుర్వేదం ప్రాచుర్యంలో ఉంటే – శుక్లయజుర్వేదాన్ని ఉత్తరభారతంలో అధ్యయనం చేస్తారు.

యజుర్వేదానికి ధనుర్వేదం ఉపవేదం, ఇందులో ముక్తక, అముక్తక, ముక్తాముక్త, యంత్రముక్తకాలు– అనే నాలుగురకాలైన ఆయుధాలు చెప్పబడ్డాయి. వీటిని నేర్చుకొనేవాళ్లు లేకపోవడంతో ఈ విద్యలు అంతరించాయి.

## సామవేదం

'సామ' అనే పదానికి గానం(పాడటం) అని అర్థం. ఋక్కులనే (ఋగ్వేదమంత్రాల్నే)రాగబద్ధంగా గానం చేస్తే, సామ మని పిలుస్తారు. సామవేదంలో ఎక్కువభాగం ఋగ్వేదంలోని 8, 9 మండలాలనుండి గ్రహించబడ్డది. సామవేదంలో సప్త స్వరాలు ఉంటాయి. సంగీతశాస్త్రానికి ఈ వేదమే మూలం. యజ్ఞంలో ఉద్గాత అనబడే సామవేదపండితులు సామవేదమంత్రాలను గానం చేస్తారు. గానంతో దేవతలు సంతుష్టులౌతారు.

వేదాలలో సామగానం చాలా కఠినమైనది. చాలా జాగ్రత్తగా పాడగలిగేవారికిమాత్రమే సామం వశమౌతుంది–అని ఋగ్వేదం చెబుతుంది. భగవద్గీతలో భగవంతుడు **"వేదాలలో నేను సామవేదం"** అని చెప్పాడు.

సామవేదం పూర్వకాలంలో వెయ్యిశాఖలుగా విస్తరించి ఉండేదని చెబుతారు. ప్రస్తుతం రాణాయనీయ, కౌథుమ, జైమినీయ అనే మూడుశాఖలుమాత్రమే దొరుకుతున్నాయి. గాంధర్వవేదం సామవేదానికి ఉపవేదం. ఇదే భారతీయసంగీతానికి మూలం. సామవేదాన్ని అధ్యయనం చేస్తున్నవారిసంఖ్య చాలా తక్కువ. తిరుమల తిరుపతి దేవస్థానం – అంతరించేవేదశాఖలనన్నింటినీ రక్షించేప్రయత్నం చేస్తూంది.

## అథర్వవేదం

అథర్వఋషి ఈ వేదాన్ని లోకానికి చెప్పాడు. కనుక ఈ వేదాన్ని అథర్వవేదమని పిలిచారు. యజ్ఞనిర్వాహకుణ్ణి 'బ్రహ్మ' అనే పదంతో పిలుస్తారు. ఈ బ్రహ్మ విధిగా అథర్వవేదంలో నిష్ణాతుడై ఉండాలి.

యజ్ఞనిర్వహణకు బ్రహ్మ, అధ్వర్యుడు, హోత, ఉద్గాత అనే నలుగురు ఋత్విక్కులు కావాలి. యజ్ఞంలో హోతగా ఉండవలసినవ్యక్తి ఋగ్వేదాధ్యయనం చేసి ఉండాలి. అధ్వర్యుడు యజుర్వేదాధ్యయనం చేసి ఉండాలి, ఉద్గాత సామవేదనిష్ణాతుడై ఉండాలి. బ్రహ్మగా వ్యవహరించేవారు అథర్వవేదంలో ప్రవీణులై ఉండాలి. మిగతా ముగ్గురు ఋత్విక్కులు చేసే పొరపాట్లను బ్రహ్మ పరిహరిస్తూ–యజ్ఞానికి అంతరాయంరాకుండా కాపాడాలి.

**వేదమేవ సదాభ్యస్యే త్తపస్తప్యన్ ద్విజోత్తమ ।**
**వేదాభ్యాసో హి విప్రస్య తపః పర మిహోచ్యతే ॥**

ఒక తపస్సు ఆచరించేటపుడు ఎంత ఏకాగ్రత, నియమం, నిష్ఠ అవసరమో వేదఅధ్యయనానికి అవి అంత అవసరం. వేదాభ్యాసం ముఖ్యమైన తపస్సు.

అథర్వసంహితలో ఆధ్యాత్మిక–ఆధిభౌతిక–ఆధిదైవిక విషయాలు చెప్పబడ్డాయి. శరీరచికిత్సకు సంబంధించిన 144 సూక్తాలు ఉన్నాయి. ఈ సూక్తాల్లో మానవశరీరానికి సంబంధించిన ప్రతిఅవయవంయొక్క స్వరూపం పేరుపేరునా చెప్పబడింది. అలాగే రాజ్యానికి, రాజధర్మానికి సంబంధించిన అనేక విషయాలు చర్చించబడ్డాయి. సమాజస్వరూపం, యజ్ఞాలు, దేవతలు, ఆధ్యాత్మికవిషయాలు వివరించబడ్డాయి. వ్యాధులను, శత్రువులను, భూతాలను, క్రూరమృగాలను మాయావులను నివారించడానికి అథర్వవేదంలో మంత్రాలున్నాయి.

రాజనీతితంత్రాలు, అర్థతంత్రాలు, కృషివాణిజ్యాలను, సమాజనిర్మాణాన్ని ప్రతిపాదించే అర్థవేదం అథర్వవేదానికి ఉపవేదం. దీన్ని ఆశ్రయించి బృహస్పతి అర్థశాస్త్రాన్ని రచించాడు. అలాగే శుక్రనీతికి, చాణక్యునిఅర్థశాస్త్రానికి అర్థవేదాన్నే మూలంగా భావిస్తారు. కొందరు శిల్పవేదాన్ని అథర్వవేద ఉపవేదంగా చెబుతారు.

## వేదాంగాలు

వేదం స్వరప్రధానం. ఇందులో చెప్పబడే అంశాలు చాలా గంభీరమైనవి. తగిన వ్యుత్పత్తి లేకుండా వీటిఅర్థాలను నిర్దుష్టంగాను, సమగ్రంగాను తెలుసుకోవడం సాధ్యంకాదు. కనుక ఈ వేదార్థాన్ని తెలుసుకోవడంకోసం ఆరు వేదాంగాలను నిర్దేశించారు. అవి – శిక్షా, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పం అనేవి. ఈ వేదాంగాల స్వరూపం తెలియనిదే వేదహృదయం సరిగా అర్థం కాదు.

### 1) శిక్ష

వేదంలోని వర్ణాలను, స్వరాలను, మాత్రలను, స్థానప్రయత్నాలను గురించి, ఉచ్చరించే విధివిధానాలను నిర్దేశించేది శిక్ష. ఇది ఒక ఉచ్చారణ శాస్త్రం(ఫొనెటిక్స్)గా చెప్పవచ్చు. ఇవి సుమారు 30కి పైగా ఉన్నట్లు తెలుస్తున్నది. అందులో యాజ్ఞవల్క్యశిక్ష, నారదీయశిక్ష, పాణినీయశిక్షలు ప్రధానమైనవి.

### 2) వ్యాకరణం

పదాలలోని ప్రకృతి–ప్రత్యయాలను వివరించి, పదం యొక్క స్వరూపాన్ని చక్కగా తెలియపరచడం, తద్ద్వారా అర్థాన్ని నిర్ధారించుకొనడానికి ఉపయోగించడం ఈ వ్యాకరణశాస్త్రం వల్ల సాధ్యమవుతుంది. అంతేకాక యజ్ఞయాగాదిఅనుష్ఠానాలలో ఒక యాగంలో నిర్దేశించినమంత్రాలను ఆధారంగా చేసుకొని, విభక్తి మార్పుచేత మరొక యాగంలో వినియోగించవలసి ఉంటుంది. ఇందుకు వ్యాకరణజ్ఞానం చాలా అవసరం. ఇంకా వేదం ఉచ్చారణప్రధానంగా ఉన్నందున మానవలోపం వలన తేడాలు ఏర్పడినప్పుడు వ్యాకరణజ్ఞానంద్వారా వాటిని సరిదిద్దుకొని, వేదంయొక్క అసలుస్వరూపాన్ని రక్షించుకొనే అవకాశం ఉంటుంది. శబ్దస్వరూపాన్ని తెలుసుకోవడానికి ఎట్టి సందేహం లేకుండగా వేదార్థాన్ని నిర్ణయించడానికి వ్యాకరణం ఉపయోగపడుతుంది. అందుకని ఇది వేదపురుషునికి ముఖస్థానీయంగా కీర్తింపబడుతున్నది.

### 3) ఛందస్సు

మంత్రాలలో ఛందస్సుగురించి తెలుసుకోవడానికి ఛందశ్శాస్త్రం చాలా ఉపకరిస్తుంది. యజ్ఞయాగాదిఅనుష్ఠానానికి ఋషి దేవతా ఛందస్సుల పరిజ్ఞానం అనివార్యం.

### 4) నిరుక్తం

వేదంలో ప్రయోగించబడిన పదాలకు నిర్వచనం 'నిరుక్తం'. దీనిని యాస్కమహర్షి రచించారు. ఈ నిరుక్తంలో నైఘంటుకకాండ, నైగమకాండ, దేవతాకాండ అని మూడు భాగాలున్నాయి. మొదటికాండలో పృథివ్యాదిలోకాలు, దిక్కులు, కాలాలకు సంబంధించిన శబ్దాలు; రెండవకాండలో మనుష్యులు, వారిఅవయవాలు మొదలగువాటికి సంబంధించిన అంశాలు వివరించబడ్డాయి. మూడవకాండలో పై రెండింటిలో వివరించబడిన ధర్మాలకు సంబంధించినపేర్లు చెప్పబడ్డాయి.

### 5) జ్యోతిషం

వేదం యజ్ఞప్రధానం. యజ్ఞాలు కాలప్రధానాలు. ఏ యజ్ఞం ఎప్పుడు చేయాలని నిర్దేశించబడినదో అప్పుడు చేస్తేనే అది నిర్దేశించిన ఫలితాలు ఇస్తుంది. ఈ కాలంగురించి నిర్ణయించుకోవడానికి జ్యోతిషశాస్త్రం తెలియాలి. అప్పుడే యజ్ఞ ఆచరణకు తగిన కాలనిర్ణయం జరుగుతుంది.

### 6) కల్పం

శ్రౌతసూత్రగ్రంథాలకు కల్పమని పేరు. వీటిని కల్పసూత్రాలని కూడా అంటారు. శ్రుతిప్రతిపాదితమైన యజ్ఞయాగాదుల ప్రయోగాలను వివరిస్తాయి. ఇందులో ప్రధానంగా యజ్ఞశాలనిర్మాణం మొదలగు అంశాలు పేర్కొనబడ్డాయి. ఈ సూత్రగ్రంథాలను అధ్యయనం చేయనిదే యజ్ఞయాగాదినిర్వహణ సాధ్యపడదు. ఇలా ఈ ఆరుఅంగాలు వేదార్థాన్ని తెలుసుకోవడానికి దోహదపడుతున్నాయి.



# వేదముల ఆవశ్యకత

– డా॥ మట్టి కృష్ణారెడ్డి

ప్రతిభారతీయునికి తన ప్రాచీనవైదికవాఙ్మయ సంపదనుగూర్చి, దానివిశిష్టతనుగూర్చి, సంస్కృతీసంప్రదాయాలనుగూర్చి అవగాహన ఉండటం అవసరం, అత్యవసరం.

నేడు చాలామంది ఆధునికవిద్యను నేర్చినవారు, మనవిలువైన వైదికసాహిత్యం విలువను తెలుసుకొనకుండానే దాన్నిగూర్చి కువిమర్శలు చేస్తూ ఉన్నారు. మనలో చాలామంది వాటిని నమ్ముతున్నారు. అందుకే మన అనంతవాఙ్మయాన్ని సంక్షిప్తంగా సామాన్యులకుసైతం అర్థమయ్యేరీతిలో స్థూలంగా తెలియజేయడం అవసరం.

వేదవాఙ్మయంయొక్క ప(చ)రమలక్ష్యం మోక్షం. ధర్మబద్ధమైనజ్ఞానంద్వారా, కర్మద్వారా అది లభిస్తుంది. ఇదే మానవుల ఉత్తమకర్తవ్యం.

భారతీయులమైన మనకు మానవధర్మాన్ని బోధించే వేదాలు ఉన్నాయి. ఈ వేదాలుమాత్రం ఒక మతానికీ, ఒక ప్రాంతానికీ, ఒక వర్గానికీ, ఒక దేశానికీ చెందినవి కావు. కాబట్టి విశ్వవాఙ్మయంగా దీన్ని పేర్కొనడం పూర్తిగా సమంజసం. ఇది మానవ ధర్మాలను బోధించేధర్మగ్రంథం. ధర్మబోధతో పాటు అనంతజ్ఞానవిజ్ఞానసంపదకు నిధి.

**వేదాలు ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే చతుర్విధపురుషార్థాలను మానవులకు బోధిస్తున్నాయి. ఈ పురుషార్థాలను సాధించడానికే ఈ మానవజన్మ లభించింది.**

వేదవేదాంగాలనీ, బ్రాహ్మణారణ్యకాలనీ, ఉపనిషదాదిశాస్త్రాలనీ, స్మృతిపురాణేతిహాసాలనీ వినటం తప్ప- వాటిల్నిగురించి చాలామందికి తెలియదు. అవి మనకు సంబంధం లేనివనీ, కొందరికే పరిమితమనీ తలచి, చదువకుండా వదలటం తగదు. అది మానవులందరి జ్ఞానమోక్ష సంపద. అలాంటి అమూల్యసంపదనుగూర్చి సంక్షిప్తంగానైనా తెలుసుకొనడం ప్రతిభారతీయునికర్తవ్యం.

**“లోకం అంతా సుఖంగా ఉండాలని కోరుకుంటుంది వేదం. కేవలం మనుషులే కాదు. పశు, పక్ష్యాదులు, ప్రకృతి కూడా ప్రశాంతంగా ఉండాలని వాంఛిస్తుంది. విశ్వశాంతి మన మహర్షుల ఆశ”**

వేదాలు ధర్మ, అర్థ, కామ, మోక్షాలనే చతుర్విధపురుషార్థాలను మానవులకు బోధిస్తున్నాయి. ఈ పురుషార్థాలను సాధించడానికే ఈ మానవజన్మ లభించింది. మానవునిసర్వతోముఖాభివృద్ధికి అవసరమైన తత్త్వాలెన్నో వేదాలలో ఉపదేశింపబడ్డాయి. భారతీయ సంస్కృతీసభ్యతలకు ధార్మిక తాత్త్విక సంపదకూ ఈ ఉపదేశింపబడిన తత్త్వాలే పునాదిరాళ్లు. భారతీయజీవన విధానానికి ఈ తత్త్వమే ఆదర్శం.

మన భారతీయసంస్కృతికి మూలాధారాలుగా, అనంతజ్ఞానవిజ్ఞానసంపదలుగా విరాజిల్లేవి చతుర్వేదాలు. ప్రపంచవాఙ్మయచరిత్రలోని శిఖరాగ్రకిరీటంలో వెలకట్టలేని దివ్యమణులు మనపవిత్రవేదాలు.

భారతీయవేదర్షులు తమ దివ్యశక్తులతో గుర్తించగా ఆవిష్కరించబడిన ఈ అనంతవేదసంస్కృతి మన జాతికి వెన్నెముకవంటిది. *“లోకాః సమస్తాః సుఖినో భవంతు”* అని అత్యంతవిశాలదృక్పథంతో తమ దేశమానవాళి సుఖాన్నిమాత్రమేగాక – సమస్తవిశ్వంలోని సమస్త లోకాలసుఖాన్నీ మన మహర్షులు మనసారా వాంఛించారు.



# జ్ఞానవైభవం - వేదవాఙ్మయం

- డా॥ ఎం.జి.నందన రావు

**వేదం అంటే ఏమిటి?**
**వేదాలు ఎలా ఉద్భవించాయి?**
**ఎప్పుడు ఉద్భవించాయి?**
**వేదాలు ఎందుకు?**
**వేదాలు మారుతూ ఉంటాయా?**
**వేదాలు ఎలా రక్షించబడ్డాయి?**
**వేదాలను ఎలా నేర్చుకొంటారు?**
**..... ఈ వ్యాసం చదవండి!!**

"...నాకు గురువుగారిమాట అంటే వేదవాక్కు", "అతనిమాటేమైనా వేదవాక్యమా" ఇలాంటి మాటల్ని మనం వింటూనే ఉంటాం. సామాన్యుల నుండి మాన్యుల వరకు అందరూ ఇలాంటిమాటలు వాడుతూనే ఉంటారు. అంటే "వేదవాక్కు అనేది మనం అతిక్రమించకూడని శాసనం" అనే భావం అందరిలోనూ ఉంది. భారతీయులందరికీ ప్రాచీన కాలంనుండికూడా వేదాలు పరమప్రమాణాలు, శాస్త్రాలలో వేదాన్ని "శబ్దప్రమాణం" అని పిలిచారు. వీటిని "ప్రభు సంహిత" (రాజుగారి ఆజ్ఞలు) అని వ్యవహరించారు. రాజుగారి ఆజ్ఞను ఎలా ధిక్కరించరాదో అలాగే వేదం చెప్పిన మాటలను అతిక్రమించరాదు అనేది తాత్పర్యం.

## వేదాల ఆవిర్భావం

వేదాలు భగవంతుని ఉచ్ఛ్వాసనిశ్వాసాలుగా వేదంలోనే చెప్పబడ్డాయి. వీటిని బ్రహ్మదేవుడు గ్రహించి లోకానికి ఉపదేశించాడు. వేదాలు అనాదిగా ఉన్నాయి. వేరువేరు కాలాలలో ఋషులు తపస్సువల్ల వేదమంత్రాలను దర్శించుకొన్నారు. వేద మంత్రాలను దర్శించుకొన్న ఋషులను మంత్రద్రష్టలని పిలుస్తారు. వేదాలను ఎవరూ రచించలేదు కనుక వీటిని **"అపౌరుషేయాలు"** అని చెబుతారు.

## వేదశబ్దానికి అర్థం

వేదమనే పదం 'విద్' అనే ధాతువునుండి ఏర్పడింది. జ్ఞానమని ఈ ధాతువుకు అర్థం. ఈ ధాతువుద్వారా వేదమంటే జ్ఞానోపదేశపరమైన గ్రంథమని చెప్పవచ్చు. లోకంలో ప్రతిజీవి తన ఇష్టాన్ని పొందడంకోసం, అనిష్టాన్ని పోగొట్టుకోవడం కోసం ఉపాయాన్ని వెతుకుతూ ఉంటుంది. శాశ్వతప్రాతిపదికలో ఇష్టప్రాప్తి. అనిష్టపరిహారాలకు సంబంధించిన అలౌకికోపాయాన్ని తెలియచేసేది కాబట్టి దీనికి వేదమని పేరు ఏర్పడిందని తైత్తిరీయసంహితాభాష్యభూమికలో - వేదాలకు భాష్యం రచించిన సాయణాచార్యులు వివరించారు. ప్రత్యక్షానుమానాలకు అందని అలౌకికోపాయమే వేదంలో ప్రతిపాదించబడిన విషయం. ధర్మాదిపురుషార్థాలు తెలియబడడంచేత, మరియు పొందబడడంచేత దీన్ని వేదమని చెబుతారనేది బహ్వృచ ప్రాతిశాఖ్యవృత్తిప్రారంభంలో దేవమిత్రునివచనం.

## వేదాలు ఎన్ని?

ప్రారంభంలో ఋక్కులు, యజుస్సులు, సామలు అన్నీ కలిసిపోయి ఒకటిగా ఉండేవి. అప్పట్లో వేదాధ్యయన మంటే అన్నింటినీ చదివేవారు. ద్వాపరయుగకాలంలో ఎంతోకాలం గురుకులంలో గడిపి వేదాధ్యయనం చేయడం కష్టంగా మారినందువల్ల వ్యాసులవారు వేదాలలోని ఋక్కులన్నింటినీ కూర్చి ఋక్సంహితను, యజుస్సులన్నింటినీ కూర్చి యజుస్సంహితగానూ, సామలను కూర్చి సామసంహితగానూ, అథర్వమంత్రాలను ఒకచోట చేర్చి అథర్వసంహితగానూ తయారు చేసారు. ద్వాపర యుగంలోనే ఒక వేదరాశి నాలుగుసంహితలుగా విభజించబడినట్లు విష్ణుపురాణం, మత్స్యపురాణాలు తెలుపుతున్నాయి.

శుక్లయుజుర్వేదసంహితకు వేదదీపమనే భాష్యాన్ని వ్రాసినమహీధరుడు తన భాష్యారంభంలో ఇలా అన్నాడు-

"బ్రహ్మనుండి పరంపరగా వచ్చిన వేదాన్ని, మందమతులైన మనుషులను దృష్టిలో పెట్టుకొని, వారిపైగల కరుణతో ఋగ్యజుస్సామాథర్వాలని నాలుగుగా విభజించి, వేదవ్యాసుడు పైల, వైశంపాయన, జైమిని, సుమంతులనే తన నలుగురు శిష్యులకు క్రమంగా ఉపదేశించాడు".

దీనివల్ల మొదట్లో ఒకటిగా ఉండే వేదాన్నే అధ్యేతల సౌకర్యంకోసం వ్యాసుడు విభజించి, వేదవ్యాసుడిగా కీర్తింపబడ్డాడు. వేదాలకు శ్రుతి, అనుశ్రవం, త్రయీ, ఆమ్నాయం,

సమామ్నాయం, ఛందస్, స్వాధ్యాయం, ఆగమం, నిగమం మొదలగు పేర్లు ఉన్నాయి.

గురువు ఉచ్చరించినదాన్ని సరిగ్గా విని, తిరిగి అలాగే ఉచ్చరిస్తూ శిష్యులు దీన్ని నేర్చుకొంటారు కాబట్టి దీన్ని శ్రుతి అని, అనుశ్రవమని పిలుస్తారు. ఋగ్యజుస్సామములు మూడింటిని "త్రయి" అనే పేరుతో పిలుస్తారు. ఎప్పుడూ అభ్యసింపబడుతుంది కనుక ఆమ్నాయమని, సమామ్నాయమని పేర్లు. ఛందశ్శబ్దానికి వేదపరంగానూ, ప్రత్యేకించి సామవేదపరం గాను ప్రయోగాలున్నాయి. వేదం వంశపరంపరగా అధ్యయనం చేయబడుతుంది కాబట్టి స్వాధ్యాయమనబడుతోందని తైత్తిరీయారణ్యకం వివరిస్తున్నది. భగవంతుని నిశ్వాసరూపంగా బయల్పడి నందున దీనికి ఆగమమని వ్యవహారం, నిరుక్తంలో యాస్కుడు దీన్ని నిగమమని వ్యవహరించాడు.

## వేదాధ్యయనపరంపర

పారంపర్యంగా వచ్చిన తమవేదశాఖను గురుకులంలో గురువు ఉచ్చరించినదాన్ని విని, అలాగే ఉచ్చరిస్తూ కంఠస్థం చేస్తాడు. వేదాలలోని స్వరాలను, అక్షరాలను తప్పులేకుండా – ఉన్నది ఉన్నట్లుగానే నేర్చుకోవడం వేదాధ్యయనం అనే పేరుతో పిలువబడుతుంది.

## వేదస్వరాలు

వేదమంత్రాలకు ఉదాత్తం, అనుదాత్తం స్వరితం అనేవి ప్రధానస్వరాలు. కొన్నివేదశాఖలలో మరికొన్నిస్వరాలుకూడ చెప్పబడ్డాయి. సామవేదాన్నిమాత్రం సప్తస్వరాలలో గానం చేస్తారు. వేదార్థాన్ని తెలుసుకోవడంలో స్వరాలు చాలా ప్రధాన పాత్రవహిస్తాయి. ఒకే శబ్దానికి అనేకఅర్థాలు ఉన్నప్పుడు ఏ శబ్దానికి ఏమిటి అర్థమని స్వరాలను ఆధారంగా చేసుకొని నిర్ణయిస్తారు.

## వేదార్థాన్ని గ్రహించే విధానం

వేదాన్ని గురుకులపద్ధతిలో అధ్యయనం చేసిన తర్వాత వేదార్థాన్ని గ్రహించే సంప్రదాయం ఉండేది. వేదార్థాన్ని గ్రహించడానికి సహకరించేవే వేదాంగాలు. అవి ఆరు– శిక్ష, కల్పం, వ్యాకరణం, నిరుక్తం, ఛందస్సు, జ్యోతిషం అనేవి.

## సామాన్యులవరకు వేదార్థం

వేదం చాలా విస్తృతమైంది. వేదాధ్యయనం చాలా శ్రమతో కూడుకొన్నది. సమాజంలో వేరువేరు వృత్తులను ఆశ్రయించినవారికి ఎన్నెన్నో సంవత్సరాలు వేదాధ్యయనం చేసే వీలు ఉండదు. కాని వేదాలు అందరిజీవితాలు సుఖంగా ఉండాలనే ఉద్దేశంతో బోధించబడ్డాయి. అలాంటప్పుడు సమాజంలోని అందరికీ వేదఫలాలు ఎలా అందుతాయి? అలా వేదఫలాలను అందించడానికి ఉన్నవ్యవస్థ ఏమిటి? అనే ప్రశ్న వస్తుంది.

వ్యవహారానికి, పరిపాలనకు, ఆర్థికవ్యవస్థలకు, ఆచారాలకు కావలసిన వేదాలలోని విషయాలను గ్రహించి ధర్మశాస్త్రాలను ఋషులు రచించారు. అవి కాలానికి తగినట్లుగా సమాజఅవసరాన్ని దృష్టిలో ఉంచుకొని వేరువేరుకాలాలలో వేరు వేరు ఋషులతో రచించబడ్డాయి. అవి సమాజజీవితానికి మార్గదర్శకంగా ఉపయోగబడ్డాయి.



పురాణాలు, రామాయణ, భారతాలు (ఇతిహాసాలు) కూడ రకరకాల ఆఖ్యానవిశేషాలతో వేదోపదేశాన్ని సామాన్యజనులకు చేరవేసాయి. పురాణేతిహాసాల ఆధారంగా ఏర్పడిన అనేకకళలు వేదార్థాలను జనాల హృదయాలకు చక్కగా హత్తుకోనేటట్లు చేసాయి. వీటిని పెద్దలు ఆచరించి చూపిన ఉత్తమమార్గాన్ని ప్రజలు అనుసరిస్తూ రావడంవల్ల వేదతత్త్వాలు ప్రతి ఒక్కరికి ఆచరణలోనూ కనబడ్డాయి.



**శ్రీ వేంకటేశ్వరస్వామితో ప్రతి రోజూ మాట్లాడి, ఆయనతో కలసి ఆనందాన్ని పంచుకున్న మహాపురుషులు ఇప్పటికీ ఏడుకొండల మీద ఉన్నారు. వారి గురించి చెప్పుకుంటే స్వామి చెవి ఒగ్గి వినేటంత పరమపవిత్రులు వాళ్లు.**




# తిరుమల విశిష్టత

– బ్రహ్మశ్రీ చాగంటి కోటేశ్వరరావుశర్మ

## తిరుమల నంబి

వారిలో అగ్రగణ్యులు, మహానుభావులు శ్రీశైలపూర్ణులు అని మనం పిలిచే తిరుమలనంబి. సహస్రదీపాలంకారం చేసే దక్షిణపురోద్దులో తిరుమలనంబి దేవాలయమని ఉంటుంది. అక్కడకు ఎవరో ఒకరిద్దరు తప్ప వెళ్ళి నమస్కరించరు. మాడ వీధులలో వేంకటేశ్వరస్వామి ఊరేగింపుగా వచ్చి తిరిగితే, మొదటగా ఆగి, నీరాజనం ఆ తిరుమలనంబి దేవాలయం దగ్గరే అందుకుంటారు.

ఆ తిరుమలనంబి ఎంతో గొప్పవారు. ప్రాచీనకాలంలో వేంకటేశ్వరస్వామికి అభిషేకానికి మడినీళ్ళు తెచ్చేవాళ్ళు లేని రోజులలో, గురువుగారి ఆదేశం అనుసరించి, నీళ్ళు తేవడానికి పాపవినాశనం దగ్గరకి చీకటిలో బ్రహ్మీముహూర్తంలో వెళ్ళి నీళ్ళు తెస్తుండేవారు. ఒక రోజు స్వామి ఆయనభక్తి పరీక్షించి, లోకానికి చాటి చెప్పాలనుకుని ఒక బోయవానిరూపంలో వచ్చి,"తాతా! దాహం వేస్తుంది నీళ్ళు ఇవ్వవా?"అని అడిగారు. "ఈ నీళ్ళు వేంకటేశ్వరస్వామికి అభిషేకానికి పట్టుకుని వెడుతున్నవి. నీకివ్వను" అన్నాడు. వేంకటేశ్వరస్వామి చేతిలో ఉన్న బాణాన్ని ఆ కుండకి వేశారు. కుండకి చిల్లుపడి నీళ్ళు పడుతుంటే స్వామి తాగేసాడు. కుండ ఖాళీ అయిపోయింది. ఏమిటి? కుండ తేలికైపోయింది అనుకుని వెనుకకి చూస్తే, పిల్లవాడు నీళ్ళు తాగుతున్నాడు. "ఎంత పని చేసావురా, శ్రీనివాసుని అభిషేకానికి తీసుకుని వెళుతున్న కుండకి కన్నం



పెట్టి నీళ్ళు తాగావా? అని నిందించబోయాడు. అప్పుడు ఆ పిల్లవాడు "తాతా బెంగపెట్టు కోకు. పాపవినాశనం కన్నా గొప్ప నీరు ఈ పక్కనే ఉంది. రా! చూపిస్తాను" అని కొండవాగులోకి తీసు కుని వెళ్ళి బాణప్రయోగం చేస్తే ఆకాశగంగ పుట్టింది. ఇక నుంచి ఈ నీటితో నాకు అభిషేకం చెయ్యి" అన్నాడు.

'నాకు అభిషేకం చెయ్యమని అంటాడేమిటి' అని తిరుమలనంబికి ఆశ్చర్యం వేసింది. ఆ పిల్లవాడిని తేరిపార చూసేసరికి అంతర్ధానమైపోయాడు. ఆ నాటి నుండి ఈనాటివరకు శుక్రవారం అభిషేకానికి ఆకాశగంగతీర్థాన్ని తీసుకుని వస్తారు. వేంకటేశ్వరస్వామిచేత "తాతా" అని పిలువబడ్డాడు కనక అక్కడ తిరుమల నంబికి మొదటిదేవాలయం. స్వామి మొదటిహారతిని మాడవీథులలో ప్రదక్షిణం చేసినప్పుడు పుచ్చుకుంటారు.

తిరుమలనంబి ఉదయం స్వామికి అభిషేకం చేసి కిందకి దిగి, – రామానుజాచార్యులు 14 సార్లు రామాయణం చెపితే ఒకమాటు చెప్పినపుడు చెప్పిన అర్థం ఇంకో మాటు చెప్పకుండా చెపుతుండేవారు. అది విని – మళ్ళీ కొండపైకి వెళుతుండేవారు. రెండుమార్లే స్వామిదర్శనమవుతున్నదని బెంగపెట్టుకున్నారు.

స్వామి తిరుమలనంబికి కలలో కనపడి నంబీ, బెంగపెట్టుకోకు. ప్రతిరోజూ మధ్యాహ్నంకూడా నీకు నా దర్శనం చెయ్యడానికి వీలుగా అలిపిరివద్ద నా పాదాలు ఉంచుతున్నానని చెప్పారు. అలిపిరివద్ద శ్రీవారిపాదుకలు తలమీద పెట్టు కుని ప్రదక్షిణం చేసే శ్రీవారిపాదాలని ఉండే పాదాలు తిరుమల నంబి గొప్పతనం, భక్తిచేత వచ్చాయి. అంత గొప్పవారు తిరుమలనంబి. *(ఇంకా ఉంది)*




# యజ్ఞ - యాగాది శబ్దములు - వ్యవహారము - శాస్త్రీయత

- దు.ఫణియజ్ఞేశ్వరయాజులు

**య**జ్ఞ, యాగ శబ్దాలు రెండూ "యజ" అనే ధాతువు నుండి ఉత్పన్నమైనవి. ఈ ధాతువు (రూట్)కు దేవపూజనం అని అర్థం. అనగా యజ్ఞం, యాగం అనే ఈ రెండుపదాలకూ "దేవతలను పూజించడం" అనేది ముఖ్యార్థం. కానీ, వీటిని ప్రయోగించుటలో శాస్త్రీయదృక్పథం అవసరం.

*"దేవతోద్దేశేన ద్రవ్యత్యాగో యాగః"* అనే యాగశబ్ద నిర్వచనం శాస్త్రప్రసిద్ధం. అంటే దేవతనుగూర్చి విహితమైన ద్రవ్యాన్ని(హవిస్సును) సమర్పించడం అని అర్థం. ఉదాహరణకు ఇంద్రయాగం, వరుణయాగం, ప్రజాపతియాగం మొదలగునవి. యజ్ఞ మంటే అంగభూతాలైన ఇతరక్రియలతో కూడిన మొత్తం కర్మకు యజ్ఞం అని పేరు. అనగా అల్పమైనప్రయత్నం చేత నిర్వర్తింపబడేది యాగమనీ, అధికమైనప్రయత్నంచేత చేయబడేది యజ్ఞమనీ తెలుస్తూంది.

యజ్ఞ, క్రతుశబ్దముల ప్రయోగవిషయంలో పైన పేర్కొన్న యోగవిశేషం యజ్ఞానికీ, యజ్ఞవిశేషం క్రతువుకూ అన్వయిస్తూంది. కాగా అల్పప్రయత్నసాధ్యము యజ్ఞమనీ, ప్రయత్నాధిక్యం కలది క్రతువనీ తెలుస్తూంది.

శ్రీవిద్యారణ్యస్వామివారు వేదభాష్యంలో "క్రతువు" అను పదానికి అర్థం "యూపవంతః" అని చెప్పి ఉన్నారు. యూపమంటే వేదవిహితమైన శ్రౌతకర్మలయందు దేవతలకొరకు వినియోగింపబడే పశువుల్ని బంధించడానికై ఉపయోగించే, దారువు (చెక్క)తో చేయబడిన ఒక స్తంభం. ఇట్టి స్తంభాలు ఏ కర్మలయందు ఉంటాయో, వాటిల్ని క్రతువులు అనే పదంతో వ్యవహరించాలని భావం.

అదేవిధంగా యాగ, హోమ శబ్దాలు రెండూ ఒకే అర్థం కలవిగా గోచరిస్తున్నా - వీటిమధ్య వ్యత్యాసం ఉంది. పూర్వం చెప్పినవిధంగా దేవతను ఉద్దేశించి, ద్రవ్యసమర్పణం చేసేది యాగమనీ, ఇచ్చట ద్రవ్యత్యాగంమాత్రం ప్రధానమైంది. ఈ ద్రవ్యాన్ని విహితదేశంలో(అగ్నిలో) ఉంచడం అనేదాన్ని హోమశబ్దంతో వ్యవహరించాలి. దీనిలో ద్రవ్యప్రక్షేపం ప్రధానం.

ఇదిమాత్రమేగాక ఈ యజ్ఞ, యాగ, క్రతుశబ్దాలు ఉపాసనాపరంగానూ ప్రయోగించబడినట్లుగా ఉపనిషత్తులు చెప్తున్నాయి.

కనుక, యజ్ఞ, యాగాది శబ్దాలు ఆయా సందర్భాలను అనుసరించి, శాస్త్రం నిర్ణయించిన ప్రకారం ప్రయోగించాలి. కానీ యథేచ్ఛంగా ప్రయోగించే అవకాశం లేదు. ఇంకనూ ఈ వ్యవహారంలో సంబంధించిన అనేకవిషయాలు మీమాంసాది శాస్త్రాలలో చెప్పినప్పటికీ విస్తరమవుతుందనే భీతితో ఉదాహరించడం లేదు. కనుక, స్థూలంగా పై శబ్దాలతో వ్యవహారం ఏ సందర్భంలో చేయాలి అనే విషయం యథామతి ప్రతిపాదించడమైంది.



# వేదసూక్తులు

**భారతీయ సంస్కృతి సదాచారం, సత్ప్రవర్తనం, సంప్రదాయం అనే మూలస్తంభాలపై నిరంతరాయంగా నిలబడి ఉంది. భారతీయులు తమ జీవన విధానాన్ని సక్రమంగా నిర్వర్తించడానికి ఋషులు, మహాపురుషులు ఏర్పరచిన ఋజుమార్గం వేదం. వేదం ప్రబోధించిన వేల సూక్తుల్లో కొన్ని మీ కోసం......**



01) **అగ్నిం మన్యే పితర మగ్నిమాపి మగ్నిం భ్రాతరం సదమిత్ సఖాయమ్ ।** **(ఋ.10-7-3)**

అగ్నిస్వరూపుడైన భగవంతుని తండ్రిగా, ఆప్తురాలైన తల్లిగా, సోదరునిగా - మిత్రుడిగా భావించి, ఉపాసించుచున్నాను.

02) **అగ్నిర్ధియా స చేతతి ।** **(ఋ.3-11-3)**

సమస్తజీవులకు అభ్యుదయాన్ని కలిగించే అగ్నిస్వరూపుడైన భగవంతుడు బుద్ధిస్వరూపంలో అందరిలో ఉన్నాడు.

03) **అతిష్ఠంతం పరివిశ్వే అభూషన్ ।** **(ఋ.3-38-4)**

అంతట వ్యాపించియున్న భగవంతుణ్ణి విశ్వమందలి సర్వ పదార్థాలూ విశేషంగా స్పష్టంగా ప్రకటింపచేస్తున్నాయి.

04) **అహన్నహిమన్వపస్తతర్ద ।** **(ఋ.1-32-1)**

మేఘాలను మథించి వర్షం కురిపించే దైవాన్ని ఎవరు తలంపరు? అందరూ కొలిచెదరు.

05) **అంతర్జ్యోతిషా సంవవృత్వత్తమోఽవః ।** **(ఋ.5-31-3)**

ఆంతరంగా దట్టమై వ్యాపించిన అజ్ఞానాంధకారాన్ని దీప జ్ఞానంతో తరిమికొట్టు.

06) **ఆ యద్వామీయ చక్షసా మిత్రం వయం చ సూరయః ।**
**వ్యచిష్ఠే బహు పాయ్యే యతేమహి స్వరాజ్యే ॥** **(ఋ.5-66-6)**

ఓ విద్వాంసులైన స్త్రీపురుషులారా! మీరు - మేము అందరం కలిసి, రక్షించుకోవలసిన స్వారాజ్యంలో అభివృద్ధికై ప్రయత్నిద్దాం.

07) **అజో న క్షాం దాధార పృథివీమ్ ।** **(ఋ.1-67-3)**

జన్మరహితుడైన (అజ) భగవంతుడు భూమ్యంతరిక్షాలను ధరించియున్నాడు.

08) **అగ్నే!సఖ్యే మారిషామా వయం తవ ।** **(ఋ.1-94-4)**

అగ్నిస్వరూపుడవగు దైవమా! నీ చెలిమితో మేము ఎట్టి హింసలకు గురికాకుండెదము గాక!

09) **ఆయుర్యజ్ఞేన కల్పతామ్ ।** **(శు.య.వే.22-33)**

యజ్ఞంద్వారా జీవితం సాఫల్యమగుగాక.

10) **అనూచీనా జీవితా మానుషేభ్యః ।** **(ఋ.4-54-2)**

తోడిమానవుల హితాన్ని కోరే మానవులకు సానుకూలమైన ప్రవర్తనతోడి జీవితాన్ని అనుగ్రహిస్తున్నావు.

11) **అధూర్వత స్వయమేతే వచోభి ర్ఋజూయతే వృజినాని బ్రువంతః ।** **(ఋ.5-12-5)**

సాధుస్వభావం గలవారి ఎడల పలుకరాని మాటలను పలుకుతూ - పనులనుచేస్తూ ఇంద్రియాలు తమను తామే పాపంచేత హింసించుకొంటున్నాయి. అనగా జీవి స్వయంగా తనకు తాను పతనమవుతున్నాడు.

12) **అదబ్ధాని వరుణస్య వ్రతాని ।** **(ఋ.1-24-10)**

దైవశాసనాలు - దైవనియమాలు అచంచలమైనవి. అవి మీరరానివి.

13) **అపృణ న్మర్డితారం న విందతే ।** **(ఋ.10-117-1)**

ఎప్పుడూ ఎవరికి పెట్టని లోభి తనకు ఏదైనా దానం చేసి సహాయపడే వాణ్ణి జీవితంలో పొందలేడు.

14) **అపాస్మాత్ ప్రేయాత్ ।** **(ఋ.10-117-4)**

దానం చేయనివానివద్దనుండి పారిపో.

15) **ఆరే అస్మాదమతిమ్ ।** **(ఋ.3-8-2)**

సర్వేశ్వరా! నాలోని బుద్ధిహీనతను తొలగించుము.

16) **అర్వన్ తవ చిత్తం వాతఽ ఇవ ధ్రజీమాన్ ।** **(శు.య.వే. 29-22)**

ఓ జీవాత్మా! నీ చిత్తం గాలివలె వేగవంతమైంది. చంచలమైంది.

17) **అపక్రామన్ పౌరుషేయాద్ వృణానో దైవ్యం వచః ।** **(అ.వే.7-105-1)**

మనిషి మాటలను ఉపేక్షించు. భగవద్వచనాలను (వేద వచనాలు) అనుసరించు.

18) అఘ శంసదుః శంసాభ్యాం కరేణానుకరేణ చ ।
యక్ష్మం చ సర్వం తేనేతో మృత్యుం చ నిరజామసి।
(అథ.వే. 12-2-2)

పాపచింతన- దురాచారానుసరణం- దుష్కర్మానుసరణం ఇవే రోగహేతువులై మృత్యుకారకమవుతాయి.

19) ఆ త్వా హరామి శత శారదాయ । (అథ.వే. 8-2-2)

నీవు నిండు నూరేండ్లు జీవించేందుకే నే నీ లోకానికి తెచ్చుచున్నాను.

20) ఆరోహ తమసో జ్యోతిః । (అథ.వే.8-1-8)

గతించినవారి కొఱకై చింతనారూపమైన అంధకారం నుండి బయటపడి నీ జీవనజ్యోతిని వెలిగించుకో.

21) అగ్నిమీళీతాధ్వరే హవిష్మాన్ । (ఋ.6-36-7)

శ్రద్ధాభక్తిసంపన్నులమై యజ్ఞంలో దైవాన్ని ఆరాధించండి.

22) ఆరోహణ మాక్రమణం జీవతో జీవతోఽ యనమ్ ।
(అథ.వే.5-30-7)

పైకి లేచి ముందుకు సాగడమే ప్రతి జీవికి జీవిత లక్ష్యం.

23) ఆయో యోనిం దేవకృతం ససాద క్రత్వా హ్యగ్ని రమృ తాన్ అతారీత్ । (ఋ.7-4-5)

తానే సృజించిన దేహాలలో ఉండే జీవులను భగవానుడే వారికర్మలనుండి తరింపచేస్తాడు.

24) అక్షేత్రవిత్ క్షేత్రవిదం హ్యప్రాట్ । (ఋ.10-32-7)

అజ్ఞానియే జ్ఞానిని ప్రశ్నించి తెలుసుకొంటాడు.

25) అపరిహ్వృతాః సనుయామ వాజమ్। (ఋ.1-102-11)

సద్బుద్ధితో భగవదుపదేశాన్ని ఆచరించెదము.

26) అగ్నే తౌల్యస్యాప్రాశాన్ । (అథ.వే. 1-72)

ఓ మేధావీ! (అగ్ని) నీవు తూచితూచి సమతౌల్యాహారాన్నే భుజించు.

27) ఇంద్ర మృళమహ్యం జీవాతు మిచ్ఛ ।
(ఋ.6-47-10)

ఇంద్రమహాదేవా! నాకు జీవించాలనే ఇచ్ఛ ఉంది. దయ చూపుము.

28) ఇదమహమనృతాత్ సత్యముపైమి । (శు.య.వే.1-5)

నేను అసత్యాన్ని విడిచి సత్యాన్ని ఆశ్రయిస్తున్నాను.

29) ఉతో రయిః పృణతో నోప దస్యతి ।
(ఋ.10-117-1)

దానం చేసిన, దైవసమర్పణం చేసిన ధనం వ్యర్థం కాదు.

30) ఉచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ । (ఋ.3-8-2)

దేవా! నేను పరమసౌభాగ్యాన్ని పొందేందుకు నన్ను సమున్నతునిగా చేయుము.

31) ఉద్వయం తమసస్పరి స్వః పశ్యంత ఉత్తరమ్ ।
(శు.య.వే.20-21)

మేము అంధకారానికి దూరంగా ఉంటూ సమస్తదేవతలను ప్రకాశింపచేసే పరమేశ్వరుని దివ్యతేజస్సును అన్ని వైపులనుండి చూస్తున్నాము.

32) ఉతాగశ్చక్రుషం దేవా దేవా జీవయథా పునః ।
(ఋ.10-137-1)

ఓ దేవతలారా! మాటిమాటికి అపరాధం చేసే మమ్ము పవిత్రజీవనదానం చేసి రక్షించండి.

33) ఉశ్మసి త్వా సధస్థ ఆ । (ఋ.8-45-20)

పరమేశ్వరా! నీ వొక్కడితోమాత్రమే ఉండేందుకు ఇష్టపడుతున్నాం.

34) ఉత స్వేన క్రతునా సంవదేత । (ఋ.10-31-2)

మాటలు చెప్పకుండ నీ కృషిద్వారానే మాటలాడుము.

35) ఉతాదిత్సంతం దాపయతు ప్రజానన్ రయిమ్ ।
(అథ.వే.3-20-8)

ఓ దేవా! దానమీయని లుబ్ధునికికూడ దానంచేసే ప్రేరణ కల్గించు.

36) ఋతం చికిత్వ ఋత మిచ్చికిద్ధి । (ఋ.5-12-2)

సత్యజ్ఞానాభిలాషీ! ఋతం అనగా సత్యాన్ని మరల మరల తెలుసుకో!



# యజ్ఞపరికరాలు

– దెందుకూరి జగన్నాథశర్మ

వేదాలకు యజ్ఞాలకు విడదీయరాని సంబంధం ఉంది. వేదాలు యజ్ఞాలకోసమే పుట్టాయి. యజ్ఞాలు నిత్యాలు, కామ్యాలు అని రెండురకాలు. తప్పనిసరిగా చేయవలసినవి నిత్యాలు, కోరికలతో చేసేవి కామ్యాలు. తప్పనిసరిగా ఆచరించవలసినవి 7 హవిర్యజ్ఞాలు, 7 పాక యజ్ఞాలు, 7 సోమసంస్థలు. మొత్తం 21 యజ్ఞాలు. కామ్య యజ్ఞాలు అనేకం. ఇవి తప్పనిసరి కావు. కామ్యయజ్ఞాలలో వివిధ ప్రయోజనాలను పొందడానికి రకరకాల కొలతలలో, వివిధరకాల యజ్ఞకుండాలు చెప్పబడ్డాయి. వీటిని 'చితి' అనే పేరుతో పిలుస్తారు. వీటిలో శ్యేనచితి చాలా శ్రేష్ఠ మైనది. శ్యేన అంటే గద్ద (గరుడపక్షి) రెక్కలు విప్పుకొని ఎగురుతున్న గరుత్మంతుని ఆకృతిలో ఈ యజ్ఞవేదికను నిర్మి స్తారు. చయనక్రతువులుగా చెప్పబడే యజ్ఞాలలో ఈ గరుడా కృతి హోమగుండాలను నిర్మిస్తారు. చివరిరోజు ఆ హోమ గుండం మధ్యలో హోమం చేస్తారు. ఇలా చేసిన యజమాని శాశ్వతమైన దేవలోకాన్ని పొందుతాడు.

**వేదం గరుత్మంతుణ్ణి వేదమయుణ్ణి వర్ణించింది. వేదంలోని త్రివృత్ అనే వేదభాగం గరుత్మంతుడికి శిరస్సు, గాయత్రం నేత్రం, సోమమే ఆత్మ, సామం శరీరం, వామదేవ్యం – బృహద్రథంతరాలు రెండు రెక్కలు, యజ్ఞాయజ్ఞియం పుచ్ఛభాగం, ఛందస్సులే అవయవాలు, ధిష్ణ్యములు అరికాళ్లు. గరుత్మంతుడు వేదమయుడైనందునే వేదవేద్యుడైన మహావిష్ణువుకు వాహనం కాగలిగాడు.**

**శ్రీ వేంకటేశ్వరస్వామివారి గరుడవాహనసేవకూడా భగవంతుణ్ణి తెలుసుకోవడానికి వేదాలు తప్ప వేరే మార్గం లేదనే సందేశాన్ని తెలుపుతుంది.**



యాగాలు నిర్వహించడానికి ఊరి వెలుపల, నదీ తీరం మొదలైన పవిత్రప్రదేశాల్లో భూమిని చదనుచేసి యాగశాలను నిర్మిస్తారు. యాగానికి కావలసిన సంభారాలను సమకూర్చుకొంటారు. యాగాలలో వరి, గోధుమ, అడవినువ్వులు మొదలైన ధాన్యాలను వాడుతారు. మేడి, రావి, జమ్మి మొదలైన చెట్ల కొమ్మలను సమిధలుగా ఉపయోగిస్తారు. దర్భలు, గరిక, రెల్లు, వట్టివేరు మొదలైన తృణాలనుకూడా ఉపయోగిస్తారు. సోమయాగాలలో సోమలత (ఒకరకమైన తీగ) అనబడే తీగ చాలా ముఖ్యమైంది. ఈ తీగను చెక్కతో తయారు చేసిన శకటం (బండి)లో సాదరంగా యాగశాలకు తీసుకొని వస్తారు. దాన్ని నలుగురు ఋత్విక్కులు కలిసి 'ఉపరవాలు' అనే రాళ్ళ సహాయంతో దంచి రసం తీస్తారు. దీన్నే సోమరసం అంటారు. అలా తీసిన రసాన్ని ద్రోణపాత్రంగా పిలువబడే చెక్కపాత్రలో వేసి, తర్వాత రకరకాల మట్టిపాత్రలతో తీసుకొని, వేరు వేరు హోమగుండాలలో అగ్నికి సమర్పిస్తారు. మిగిలిన దాన్ని ఋత్విక్కులు, యజమాని ప్రసాదంగా స్వీకరిస్తారు. స్రువం అనే చెక్క గరిటితో నెయ్యి తీసుకొని స్రుక్ అనే మరొక చెక్క గరిటెలో వేసుకొని హోమం చేస్తారు. హవిస్సులను అగ్నికి సమర్పించడానికి స్రుక్కును వాడతారు. ఇలా యాగాన్ని పూర్తి చేసుకొన్న దంపతులను (యజమానులను) మేడిచెక్కతో తయారుచేయబడిన రథంలో కూర్చోపెట్టుకొని ఋత్విక్కులే లాగుతూ సాదరంగా మరల గృహానికి చేరుస్తారు. యాగాన్ని పూర్తి చేసుకొన్న యజమాని ఇంద్రునితో సమానుడౌతాడు.



వేదాలు చరాచరాత్మకమైన విశ్వానికి మేలు చేసే అన్ని విష యాలనూ బోధించాయి. అవి అన్ని కాలాలలోనూ అందరికీ ఉపయోగపడేవి. వేదాలు స్వరాలపై ఆధారపడి ఉన్నాయి. వేదాలు స్వరనియమకారణంగానే ఎన్నో లక్షలసంవత్సరాలుగా యథాతథంగా పరంపరగా కొనసాగుతున్నాయి. స్వరం మారితే శబ్దానికి అర్థం మారుతుంది. అర్థం మారితే అనర్థమే జరుగుతుంది. కనుక వేదానికి స్వరాలే ప్రాణాలు.

సామాన్యంగా ఈ స్వరాలు ఉదాత్త, అనుదాత్త, స్వరితాలు అని మూడురకాలు. దీర్ఘస్వరిత మనే భేదాన్ని కలుపుకొంటే నాల్గురకాలు. వీటిల్ని అభ్యాసం చేసి, తప్పులేకుండా పలకడానికి ఎన్నో సంవత్సరాల కృషి ఉండాలి. అలాంటప్పుడు సామవేదంలో మంత్రాలకు ఏడుస్వరాలు. ఏడుస్వరాలతో పాటు మూడుగ్రామాలను, 21 మూర్ఛనలను, 49 తానాలను దృష్టిలో పెట్టుకోవాలి. కాబట్టి మిగిలిన వేద పాఠంకంటే సామగానం చాలా కష్టమైంది.

**"వేదానాం సామవేదోఽస్మి" అన్నాడు- గీతాచార్యుడు శ్రీ కృష్ణ పరమాత్మ. యజ్ఞాలలో సామ వేదం బాగా వినియోగించబడు తుంది.**

ఋగ్వేదంలోని ఋక్కులనే సామ రూపంతో గానం చేస్తారు. గానం చేసేట ప్పుడు అందులో ఉండే ప్రస్తావం, ఉద్గీథం, ప్రతిహారం, ఉపద్రవం, నిధనం అనే ఐదు భాగాలను అర్థం చేసుకోవాలి. గానం

# వేదానాం సామవేదోఽస్మి

విద్వాన్ మహాబలేశ్వర భట్






ప్రకృతి, ఊహ అని రెండురకాలు. ప్రకృతిలో ఏడుగానాలు, ఊహలో ఏడు తంత్రాలుంటాయి. ప్రకృతిలో ఒకే ఋక్కులో ఒకటి, రెండు, మూడు, నాలుగు ఇలా పదహారుసామల దాకా గానం చేయదంకూడా ఉంది. ఇలా సామగానం ఎంతో జాగ్రత్తగా, శ్రద్ధావంతులై పఠించేవాళ్లకు తప్ప ఇతరులకు సాధ్యపడదు.

సామవేదం గొప్పతనాన్ని ఎన్నో విధాలుగా తెలియ పరచారు.

సప్తస్వరైః సమస్తం యో
జగదేతత్ చరాచరమ్ ।
సంజీవయతి విశ్వాత్మా స
మే విష్ణుః ప్రసీదతు ॥

విశ్వమంతా వ్యాపించి ఉన్న పరమాత్మ సప్త స్వరాలతో ఈ జగత్తును జీవింపచేస్తున్నాడు.

ఛాందోగ్యోపనిషత్తు సామవేద ఉత్కర్షను - 'ఏషాం భూతానాం పృథివీ రసః, .........' అనే మంత్రంలో తర్కబద్ధంగా తెలిపింది.

"పంచభూతాలకు భూమి రసం. (రసం అంటే సారమని అర్థం). భూమికి సారం నీరు, నీటికి ఓషధులు (ధాన్యాలు,సస్యాలు మొ॥) సారం. ఓషధులకు పురుషుడు (మనిషి) సారం, మనిషిలో వాక్కు సారం, వాక్కులకు సారం ఋక్కులు, ఋక్కులకు సామమే సారం, సామంలోకూడా ఉద్గీథ మనే గానం గొప్పది".

వేదాలలో ఋగ్వేదం- అగ్నినుండి, యజు ర్వేదం - వాయువునుండి, సామవేదం - సూర్యుడినుండి ఉద్భవించాయి. సామగానం చాలా ఆనందాన్ని కలుగజే స్తుంది. యజ్ఞయాగాలు సామవేదంనుండే ప్రారంభం చేసి, సామవేదంతోనే ముగిస్తారు. యజ్ఞమండపంలోని హృదయభాగంలో సామవేదంవాళ్లు ఉండి, సామగానం చేస్తారు. యజ్ఞానికి బృహత్‌సామం ముఖ్యమైన సామగానం. సామవేదంలో భగవంతుడు బృహత్‌సామరూపంలో ఉన్నాడు. "సామాని యో వేత్తి స వేద తత్త్వమ్" అనే మాట ఉంది. సామాలను ఎవరు తెలుసుకొన్నారో వారే తత్త్వాన్ని ఎరిగిన వారు, అని అర్థం. వేదాలలో సామవేదం గొప్పది. దేవతలను ప్రసన్నం చేసుకోవడంకోసం వేద మంత్రాలున్నాయి. సామవేదం సంగీతమయమైంది కనుక సామగానాన్ని విన్న వెంటనే దేవతలు ప్రసన్నులౌతారు. సంగీతానికి వశం కానివాళ్లు ఎవరుంటారు? "శిశు ర్వేత్తి పశు ర్వేత్తి...." అన్నారు గదా!

ఇలా ఎన్నో కారణాలచేత సామవేదం గొప్పతాన్ని లోకానికి చాటుతూ భగవంతుడు భగవద్గీతలో "వేదానాం సామవేదో஽స్మి" (వేదాలలో నేను సామవేదంగా ఉన్నాను) అని విభూతియోగంగా పేరున్న పదవఅధ్యాయంలో పేర్కొ న్నాడు.



# వందే గోమాతరం

- డా॥ కలువగుంట రామమూర్తి

"తక్రం శక్రే న లభ్యతే" అనేది సంస్కృతం సామెత! తక్రం అంటే మజ్జిగ, శక్రుడు అంటే ఇంద్రునికి కూడా లభించదని అర్థం. "మిత్ర స్యాహం చక్షుషా సర్వాణి భూతాని సమీక్షే"- సర్వభూతాలను మిత్రులలాగ ప్రేమమయదృష్టితో చూతునుగాక!

"పశూన్ పాహి - ద్విపాద్వా చతుష్పాత్ పాహి" "రెండు పాదాలు గల పక్షులను- నాల్గుపాదాలుగల పశువులను రక్షించుచుందుము గాక!" అంటూ యజుర్వేదం ఘోషిస్తోంది.

"ప్రాణివధంకర్మ పశ్వాదియాగం న కుర్మః" మేము ప్రాణి హింసాత్మకమగు పశ్వాదియాగాన్ని చేయము - అంటూ సామవేద ఋషులు ప్రతిజ్ఞ చేసి ఉన్నారు.

వ్యాసవిరచిత పంచమవేదమైన మహాభారతంలోని శాంతి పర్వం - మద్యం, మత్స్యం, పశుమాంస ఆసవాలను యజ్ఞాలలో కొందరు ధూర్తులు చేర్చారని, వేదవిదులు చేయలేదనీ ప్రకటించింది.

"ధూర్తైః ప్రవర్తితం యజ్ఞే - నైత ద్వేదేషు విద్యతే" క్వచిత్ గ్రంథాన్ ప్రక్షిపంతి"- అంటూ దుర్మార్గులు గ్రంథాలను తమకు అనుకూలమైన మార్పులు చేర్పులతో భ్రష్టు పట్టించారు - అంది.

భారతం శాంతిపర్వంలోనే మరో సందర్భంలో-

యూపం ఛిత్వా పశూన్ హత్వా, కృత్వా రుధిరకర్దమమ్
యద్యేవం గమ్యతే స్వర్గం నరకం కేన గమ్యతే

- అంటూ వ్యాసులవారు సూటిగా ప్రశ్నిస్తున్నారు. యూపస్తంభానికి కట్టిన పశువులను చంపి, రక్తపు బురదను సృష్టించినవారే స్వర్గానికి పోగలరు అన్నప్పుడు - ఇంక నరకానికి పోయేవారెవరు? వారు ఇంకెలాంటి ఘాతుకాలు చేయాలి?

స్యాద్వాదమంజరి-యజ్ఞములలో ప్రాణుల్ని హింసించడం ధర్మమను కొని, ఉత్తమగతులకు పోదలచుకున్నవాళ్లు నల్లత్రాచుముఖం నుండి అమృత వర్షాన్ని ఆశించే అజ్ఞానులు, మూఢులు అంటుంది.

జ్యోతిష్టోమాదియజ్ఞాలలో వధింపబడే పశువులు స్వర్గానికి పోగలిగినపుడు యజ్ఞాన్ని చేయించే యజమానుడు తనతండ్రిని చంపించి, స్వర్గానికి

గోమాత, భూమాత
మనకు జీవనాధారాలు.
గోవు నడయాడే సర్వదేవతల
ఆలయసముదాయం.

గోవు సజీవ ఆయుర్వేదవైద్యశాల.
గోవు భూలోకకామధేనువు.
పాలు మానవులకు
లభించిన అమృతం!

గోవులను పాలించి,
కృష్ణుడు గోపాలుడయినాడు.
పంటలు పండించి,
బలరాముడు హలాయుధుడైనాడు-
పాడిపంటల ప్రతీకలే కృష్ణబలరాములు.

ఏల పంపించుకోలేకపోయాడు? అంటూ సర్వదర్శనసంగ్రహం–చార్వాకదర్శనం నిలదీస్తూంది.

జ్ఞానం– వివేకంలేని పశువైనా – ద్విపాదపశువైనా స్వర్గ లోకదివ్యత్వానికి అనర్హమే!

వేదాలు గోవులను "అఘ్న్యా–అదితి" అనే పేర్లతో సంబోధించాయి– "అహన్తవ్యా – అఖండనీయ" అని వాటిఅర్థం. శతఘ్ని– శత్రుఘ్నుడు– కృతఘ్నుడు– అనే మాటలలోని 'ఘ్న' అనే అక్షరానికి రూపుమాపేవాడు అని అర్థం. వందమందిని చంపించి 'శతఘ్న–శత్రువుల్ని వధించేవాడు శత్రుఘ్నుడు. కృతజ్ఞతను వధించేవాడు కృతఘ్నుడు. "అఘ్న్యా"– అంటూ వేదాలు గోవును చంపకూడదన్నాయి.

సూయవసాద్ భగవతీ హి భూయా అథోవయం భగవన్తః స్యామ ।
అద్ధి తృణ మఘ్న్యే విశ్వదానీం పిబ శుద్ధ ముదక మాచరన్తీ ॥

"గోమాతా! నీవు తృణాన్నీ, పరిశుద్ధజలాన్నీ త్రాగుతూ ఎల్లప్పుడూ ఆరోగ్యంగా ఉండు. మేముకూడా ఉత్తమమైన, సాత్త్వికమైన నీక్షీరధారల్ని గ్రోలుతూ ధర్మవర్తనులమై – జ్ఞానులమై ఐశ్వర్యవంతులమై ఉందుముగాక!"

ఈ విధంగా ఋగ్వేదం **1-164-40** మంత్రంతో వివరిస్తుంది – గోమాతను అఘ్న్యా అంటూ సంబోధించిన వేద మంత్రాలు ఋగ్వేదంలో, తదితరవేదాలలో వందల సంఖ్యలో ఉన్నాయి.

వేదం– గోవులు మానవుల ఆరోగ్యసౌభాగ్యాలకు మూలమనీ– కరిగించన ఆవునేతిని దర్శించడమే – పరమేశ్వరదర్శనమని, ప్రభుదర్శనమనీ ఉపదేశమిస్తూంది.

బ్రాహ్మీముహూర్తంలో మేల్కొని, గోవులకు సేవలు చేసి, వాటిపాలను సేవించి ఆరోగ్యవంతుడు కమ్ము!

గోవు ఎప్పుడూ చంపకూడనిది– శిశువులకు గోక్షీరం అత్యధికలాభదాయకం. పాలతో మానవులకు చిత్తశుద్ధి సిద్ధిస్తుంది. ఉత్తమరీతిలో గోవుల్ని సేవించేవాళ్లు, గోవుక్షీరాన్ని సేవించేవాళ్లు – బుద్ధిమంతులు – సౌమ్యులు – విద్వాంసులు అవుతారు.

ధేనువులక్షీరాన్నీ – గోవులప్రాణాల్నీ బలాత్కారంగా హరించేవాళ్లను యాతుధానులు– రాక్షసులనీ– అలాంటి వాళ్లు ప్రాణదండన విధించడానికికూడా అర్హులని అంటుంది – ఋగ్వేదం.



ప్రజాపీడకులైనవారు గోవులు మున్నగు పశువులకు విషం ఇచ్చినా– వాటిల్ని చంపినా – దుష్టాచారపరులు గోవును ఖండించినా, సర్వజనప్రేరకుడగు రాజు వీళ్లను రాజ్యంనుండి పారద్రోలాలి – వాళ్లసర్వస్వాన్ని హరించివేయాలి – వాళ్లకు అన్నం – ఓషధులు అందకుండా చూడాలి – అంటూ ఋగ్వేదం (ఋ 10-87-18)తో పాటు అథర్వవేదం (8-3-16) కూడా శాసిస్తున్నది. **"గోబ్రాహ్మణేభ్యః శుభ మస్తు నిత్యం"** అనే ఆశంస జగద్విదితమే! గోవుకు మహోన్నతస్థానాన్ని ఏర్పరుస్తున్నది ఋగ్వేదం.

"గోవు రుద్రబ్రహ్మచారులకు తల్లి వంటిది–వసుబ్రహ్మచారులకు ప్రియమైన

కూతురువంటిది- ఆదిత్యబ్రహ్మచారులకు స్నేహశీలి అయిన సోదరివంటిది - క్షీరానికి అమృతకేంద్రమైంది- దోషరహిత మైంది - ఇటువంటి గోవులను - చంపవద్దు- ఈ విధంగా నేను ఆలోచనాపరులకు ప్రతిమనుష్యునికి ఉపదేశిస్తున్నాను - అంటుంది - వేదం!

'రుద్రాణామ్' అంటే క్షత్రియుల కనీ - 'వసూనామ్' అంటే వైశ్యుల కని - 'ఆదిత్యానామ్' అంటే బ్రాహ్మణుల కనీ వేద వ్యాఖ్యాత లన్నారు-

యజుర్వేదంకూడా రాజును హెచ్చరిస్తూ "పరోపకారి వైన ఓరాజా! మానవులకు అసంఖ్యాకమైన సుఖాల్ని ప్రసాదిం చేది- క్షీరధారల్ని వర్షించేదీ - త్రాగు నీటిబావివలె ప్రాణాధార మైందీ- వీర్యాభివృద్ధిని గల్గించే నేతిని కల్పించేదీ- అయిన గోవును వధించడాన్ని తప్పక మాన్పించాలి.

**"అంతకాయ గోఘాతకమ్"**-గోవులను హత మొనర్చే వాళ్ళను అంతమొనర్చుము అంటూ గోవధ మహాపరాధమనీ- గోహత్యమహాపాపమనీ ప్రకటిస్తూంది - యజుర్వేదం!

అథర్వవేదంకూడా గోమాతపవిత్రను అభివర్ణిస్తూ - "గోమాతా! నీ అమృతధారలవంటి పాలతో దుర్బలుల్ని బల శాలురుగ చేస్తావు. నీ అంబారావధ్వని మహోత్తమమైంది. నీవు గృహసీమను కల్యాణప్రదం చేస్తావు- నీ మహిమను గొప్ప గొప్పసభలందు విజ్ఞులు స్తుతిస్తూ గానం చేస్తుంటారు." **(అథర్వ 4-21-6)**

"గోవులారా! మీరు ప్రజలను సుసంపన్నులను చేయండి. తృణసమృద్ధిగల ఉత్తమమైన మైదానాలలో విహరించండి. స్వచ్ఛ మైన జలాశయాలలో దప్పిక తీర్చుకొనండి- చోరులు- ఘాత కులు-మీకుయజమానులు గాకుందురుగాక! క్రూరుల శస్త్రాలు మీపై పడకుందుగాక! **(అథర్వ 4-21-6)**

"ఓ దుష్టుడా! నీ వొకవేళ మా గోవులను-అశ్వాలను-గొఱ్ఱెలను- మేకలను- పురుషలను హత్యచేస్తే-నిన్ను సీసపుగుండుతో కాల్చి చంపుదుము" అని ఋగ్వేద - యజుర్వేదాలలోలాగా గోఘాతకులకు అథర్వవేదంకూడా ప్రాణదండన విధించింది. **(అథర్వ1-16-4)**

ప్రతి మానవుడు తన తల్లి, తండ్రి, సోదరుడు మొదలైన బంధుజనులను ప్రేమతో చూచుకొనేలా, గోవులు మున్నగు పశువులను పరమమిత్రులవలె భావించాలి - వీటినుండే ఓషధులు - అన్నం - బలం - సువర్ణమైన రూపతేజస్సు - సుఖం ప్రాప్తిస్తుంది.

ప్రాచీనవైదికఆర్యులు విజ్ఞులు కాబట్టి, బియ్యం, నెయ్యి మున్నగువాటిల్ని యాచించి, వాటితో యజ్ఞాలు నిర్వర్తించే వాళ్లని - ప్రశంసిచారు.

అగ్నికి ఆహుతినిచ్చే ఓషధుల్లో అశ్వగంధిని 'అశ్వ' అనీ, మేషపర్ణిని 'మేష' అన్నారు. ఇలాగే తురగీ- వనజా - హయ- ఋషభ- వశా- లాంటివి ఓషధులని తెలియక, పాశ్చాత్యులు వీటిల్ని జంతువులనుకొని, యజ్ఞాలలో జంతుబలులు విశేషంగా జరిగాయని వ్యాఖ్యానించారు-

వేదకాలంలో యజ్ఞాల్లో జంతుబలులు అసలు జరుగనే లేదు- అనలేముకానీ- వాటిని అనార్యులు- దుష్టులు- మాంస భక్షకులు- దుష్టాచారులు తమ తమ వాంఛల్ని- మొక్కు బళ్లనూ, తీర్చుకోడానికి అలా చేసి ఉంటారు.

పాలు సంపూర్ణాహారం! అందరికీ శక్తినిచ్చే అమృతం - శక్తి దేశభక్తికి మూలం - అలాంటి క్షీరఅమృతధారల్ని వర్షించే గోమాతల్ని పూజించండి, కాపాడండి.

**హింస మానవధర్మం కాదు!**






# వేదాలలో నారీమణులు

- డా॥ విష్ణుభట్ల గోపాలకృష్ణమూర్తి

వేదవాఙ్మయాన్ని తమ వాక్సౌందర్యంతో అలంకరించి, ఆరాధించిన మహిళామణులెందరో ఉన్నారు. శౌనకుని బృహద్దేవత ఇరవైఏడుమంది బ్రహ్మవాదినులైన ఋషికలు, మంత్రద్రష్టలపేర్లను పేర్కొంది. వారిలో ఘోష, గోధ, విశ్వవార, అపాల, జుహూ, అగస్త్యసోదరి, అదితి, సరమ, రోమశ, ఊర్వశి, లోపాముద్ర, యమి, శశ్వతి, శ్రీ, లాక్ష, సర్పరాజ్ఞి, వాక్, శ్రద్ధ, మేధ, దక్షిణ, ఇంద్రాణి, రాత్రి, ఇంద్రమాత మొదలగువారున్నారు. వీరు గాక పౌలోమి, సిక్తానివాపరి, దాక్షాయణి, వాగంభృణి, గార్గి, మైత్రేయి, కాక్షీవతి, సూర్యాసావిత్రి, వసుక్రపత్ని, ఉశన, మేథి, గౌరివీతి, శైలకి, జయ, ప్రాదురాక్షి, భరద్వాజపుత్రి, రమ్యాక్షి, లౌగాక్షి, వసుశ్రుత, వారుణి, విదర్భ, వృష, సునీతి, ఆసురి, హైమ, శిరింబిఠ మొదలైన బ్రహ్మవాదినులెందరో మనకు దర్శనమిస్తారు.

వీరిలో అదితి దేవమాత. కద్రువ నాగమాత. లోపాముద్ర అగస్త్యుని ఇల్లాలు. ఉశన భృగువుభార్య. మేథి ధరణీ దక్షుల కుమార్తె. అపాల అత్రిమహర్షి కుమార్తె. గార్గి వచక్నుని కుమార్తె. మైత్రేయి యాజ్ఞవల్క్యుని భార్య. 'వాక్' అంభృణుని కుమార్తె. శచి పులోముని కుమార్తె. సూర్య సవితకుమార్తె, సోముని భార్య. ఘోష కక్షీవంతుని కుమార్తె, సుహస్త్యుని తల్లి. జుహూ బ్రహ్మజాయ, వాగ్దేవి.

ఋగ్వేదంలోని శ్రద్ధాసూక్తంలో శ్రద్ధాకామాయని అనే ఋషిక శ్రద్ధ త్రికాలసంధ్యవంటిదని చెప్పింది.

అంభృణ మహర్షి కుమార్తె 'వాక్కు' అనే ఋషిక-తానే వాగ్దేవిగా ఆత్మకథను చెబుతూ ఆత్మతత్త్వాన్ని వివరించింది.

వేదాలకు వ్యాఖ్యానం వ్రాసిన సాయణాచార్యులు మంత్రద్రష్టలలో ఈమెను 'బ్రహ్మవిదుషి'గా పేర్కొన్నాడు. బ్రహ్మనుగూర్చి చెప్పేవారు-బ్రహ్మవాదినులు. బ్రహ్మనుగూర్చి తెలుసుకొన్నవారు, బ్రహ్మనుభూతిని పొందినవారు బ్రహ్మవిదులు లేదా బ్రహ్మవిదుషీమణులు. ఇంకా 'సూర్యసావిత్రి' అనే ఋషిక పాణిగ్రహణసంస్కారాన్నిగురించి నలభైఏడుఋుక్కులు దర్శించింది. ఈమె అథర్వవేదంలో 139 మంత్రాలు దర్శించింది. మొత్తం ఋగ్వేదంలో ఇరవైనాలుగుమంది మహిళామణులు దర్శించిన 224 మంత్రాలున్నాయి. అథర్వవేదంలో ఐదుగురు ఋషికలు 198 మంత్రాలను దర్శించారు. శుక్లయజుస్సంహితను దర్శించినవారిలో బ్రహ్మవాదినులైన స్త్రీలున్నారు. ఇవన్నీ

జాగ్రత్తగా పరిశీలిస్తే వేదకాలంలో స్త్రీ సమాజం ఎంత ప్రబుద్ధంగా, సక్రమంగా, సార్థకమైన జీవితాన్ని అనుభవించి, అనుభవింపజేసిందో తెలుస్తుంది.

ఋషికలు లేదా మంత్రద్రష్టలందరూ బ్రహ్మవాదినులు కారు. వారంతా సన్న్యసించలేదు. వారిలో బ్రహ్మచారిణులు, గృహిణులు ఉన్నారు. సన్న్యాసినులను, బ్రహ్మచారిణులను, గృహిణులను కూడా బ్రహ్మవాదినులనేవారు. వారు శాంతమూర్తులు, త్యాగమూర్తులు. వారికి ఓర్పు సహజాభరణంగా ఉండేది. వారు మానవసేవే మాధవసేవగా భావించేవారు. వారు తమ మనస్సును నిగ్రహించుకొని, త్యాగమయమైన, శాంతిమయమైన జీవితాన్ని గడిపారు. వారు తపస్సు చేసి, భగవంతుణ్ణి శాంతిమయమైన, ఉన్నతజీవితాన్ని కోరేవారు. ఆ రోజుల్లో కోరికలను నెరవేర్చుకోవడానికి సాధారణంగా తపస్సు సాధనంగా ఉండేది. వారికి వివాహజీవితంపట్ల ఎంతో గౌరవముండేది. భార్యాభర్తలు సర్దుకుపోయేవారు. సమాజంలో వారికి తగిన గౌరవముండేది. యజ్ఞనిర్వహణకు యజమానితో పాటు యజమానిపత్ని కూడా అంత ముఖ్యం. ఋషికలు 1)ఋతాన్ని పరిరక్షించుకోవడం, 2)సంతానాన్ని కనడం, 3)యజ్ఞంలో పాల్గొనడం – ఈ మూడూ తమ బాధ్యతగా, హక్కుగా భావించేవారు.

ఒకే కుమార్తెను 'పుత్రిక' అనేవారు. ఆమె పుత్రునితో సమానం. ఆమె వివాహమైన తరువాతకూడా తండ్రికి అంత్యక్రియలు నిర్వర్తించవచ్చు. ఆమె కేవలం ఆస్తికిమాత్రమే వారసురాలు కాదు. న్యాయంగా పుత్రునితో సమానం. పండితురాలైన కుమార్తె కలగడానికి తిలౌదనం వండి, తినమని బృహదారణ్యకోపనిషత్తు ఇలా పేర్కొంది – **'అథ య ఇచ్ఛేద్ దుహితా మే పండితా జాయేత తిలౌదనౌ పాచయిత్వా అశ్నీయాతామితి'**– (బృహదారణ్యకోపనిషద్. 6-4-17.)

వేదకాలంలో స్త్రీలకు సైనికశిక్షణ నిచ్చేవారు. స్త్రీలు సైన్యంలో చేరేవారు. 'స్త్రియో హి దాస ఆయుధాని చక్రే' కిం మాకర న్నబలా అస్య సేనాః' దీన్నిబట్టి ఋగ్వేదసమాజంలో స్త్రీలు విద్యావంతులై, భౌతిక– పారమార్థిక విద్యలన్నీ నేర్చేవారని తెలుస్తూంది. విశ్పల ఖేలుని భార్య. ఆమె భర్తతో యుద్ధభూమికి వెళ్ళి, శత్రువులతో పోరాడింది. ఆ పోరాటంలో తన కాలు పోగొట్టుకొంది. అశ్వినీదేవతలు ఆమెకు ఇనుపకాలు అమర్చారు. 'సద్యో జంఘా మాయసీం విశ్పలాయై ఘనే హితే సర్తవే ప్రత్యధత్తమ్' (ఋ. 1. 116. 15). అలాగే ముద్గలాని ముద్గలుని భార్య. ఆమె సైనికశిక్షణ పొందింది. ఆమె తన భర్తకు రథసారథి. 'రథీ రభూ న్ముద్గలానీ గవిష్టౌ భరే కృతం వ్యచేదింద్ర సేనా'– (ఋ. 10. 102. 2). ఇంద్రుడు వృత్రాసురుని తల్లి 'దాసు'పై వజ్రాయుధం వేసి సంహరించాడు.

ఆ కాలంలో స్త్రీలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలుండేవి. వారు పండుగలలో ఒకచోట చేరేవారు. సభలలో పాల్గొనేవారు. సభ, విదథ, సమాన అనే పేర్లుగల ప్రసిద్ధమైనసభలలో పాల్గొనేవారు. 'యోషా సభావతీ' 'త్వం విదథ మావదాసి'. వసంతమాసంలో జరిగే 'సమాన' అనే ఉత్సవంలో యువతీ యువకులు పాల్గొని, స్వేచ్ఛగా మాట్లాడుకొనేవారు. తమకు నచ్చిన జీవితభాగస్వామిని ఎన్నుకొని, తల్లిదండ్రులకు చెప్పేవారు. వారితల్లిదండ్రులువారికి వివాహాలు చేసేవారు. అప్పుడు బాల్యవివాహాలు లేవు. కన్యకు పదహారు సంవత్సరాలు నిండిన తర్వాతే వివాహం చేసేవారు. స్త్రీజీవితంలో వివాహం ముఖ్య సంఘటన, సంస్కారం. దీనిలోకూడా వారికి స్వేచ్ఛ ఉండేది. 'భద్రా వధూ ర్భవతి యత్ సుపేశాః స్వయం సామిత్రం వృణుతే జనే చిత్'.

వివాహానికి ముందు స్త్రీ పురుషులిరువురు సగభాగమేనని, వివాహం తరువాత వారికి పూర్ణత్వం సిద్ధిస్తుందని



**స్త్రీలు తమ సత్ప్రవర్తనచేత, మాతృత్వంచేత, ఇల్లు తీర్చిదిద్దడం చేత సదా పూజ్యులని వరాహమిహిరుడు బృహత్సంహితలో పేర్కొన్నాడు. బ్రాహ్మణుల పాదాలు పవిత్రాలు. గోవుల పృష్ఠభాగం పవిత్రం. ఏనుగుల, గుఱ్ఱముల ముఖభాగం పవిత్రం. కానీ, స్త్రీలు అంతటా పవిత్రులని చెప్పాడు. ఇంకా ఏ ఇళ్లలో స్త్రీలు గౌరవించబడకుండా శపిస్తారో ఆ ఇళ్లు (కుటుంబాలు) దయ్యం పట్టినవాటి వలె (పిశాచగ్రస్త మైనవాటి వలె) పూర్తిగా నశిస్తాయన్నాడు.**

(పూర్ణులవుతారని) శతపథబ్రాహ్మణ మిలా పేర్కొంది–
'అథో అర్ధోవా ఏష ఆత్మనో యత్పత్నీ । అర్ధో వైష ఆత్మనో యజ్జాయా। అథ యదైవ జాయాం విందతేఽథ ప్రజాయతే తర్హి సర్వో భవతి'– (శతపథ బ్రాహ్మణం–1.6.10). పురుషుడు సగమే. పూర్ణుడు కాడు. భార్యతో కలసి, సంతానాన్ని పొందినప్పుడే పూర్ణుడవుతాడు. సత్సంతానాన్ని అందించే మహిళా మూర్తులు ఇళ్ళకు మణిదీపాలని మనువిలా చెప్పాడు–
'ప్రజననార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః' – మనుస్మృతి. వంశం అవిచ్ఛిన్నంగా కొనసాగడం, స్వర్గ ప్రాప్తి భార్యద్వారానే లభిస్తాయని యాజ్ఞవల్క్యుడు వక్కాణించాడు. 'లోకానంత్యం దివః ప్రాప్తః' – యాజ్ఞవల్క్య స్మృతి.

గృహిణిని గృహసామ్రాజ్ఞిగా వేదం పేర్కొంది. "ఓ వధువా! నీవు అత్తమామలు, ఆడుబిడ్డ, మరది–వీరిపట్ల మంచిరాణిలాగా ప్రవర్తించు. నీవు సుమంగళిగా పతిని పొందు, మా మనుష్యులకు, పశువులకు మేలు కలిగించు. మీరిరువురు ఈ లోకంలో కలసి మెలసి, పుత్రపౌత్రులతో క్రీడిస్తూ, సంతోషంతో పూర్ణాయుష్మంతులై ఉండండి. వియోగం పొందకండి" అని ఋగ్వేదం ఆదేశించింది.

జీవితంలో చివరివరకు కలసి ఉండే మన భారతీయ వివాహవ్యవస్థ ఇప్పటికే ప్రపంచానికి ఆదర్శమైంది. భారతీయ సంస్కృతీపరిరక్షణకు, సామాజిక సుస్థిరతకు మూలం భారతీయవివాహవ్యవస్థ, కుటుంబ వ్యవస్థలే! వీటి విలువలను గుర్తించి, మనం వీటిని సంరక్షించుకోవలసి ఉంది.



ఇక తల్లిగా స్త్రీస్థానం అద్వితీయమైంది. ఆమెను ప్రత్యక్ష దైవంగా, ప్రథమవందనీయురాలుగా వేదం పేర్కొంది. 'మాతృదేవో భవ'. 'న మాతుః పరదైవతమ్'. తల్లిని మించిన దైవం లేదని మన సంస్కృతి చాటి చెప్పింది. మాతృమూర్తులు శీలనిర్మాణశిల్పులు. తల్లిఒడి మొదటి బడి. అమ్మ ఆదిగురువు. గురువులందరిలో తల్లి పరమగురువు. 'గురూణాంచైవ సర్వేషాం మాతా పరమకో గురుః'. పదిమంది ఉపాధ్యాయుల కంటె ఒక ఆచార్యుడు, నూరుమంది ఆచార్యులకంటె తండ్రి, వెయ్యి మంది తండ్రులకంటె తల్లి గౌరవంలో అధికురాలని మనువు చెప్పాడు.

కనుకనే స్త్రీలను గౌరవించాలని, అప్పుడు దేవతలు సంతోషిస్తారని, స్త్రీలను గౌరవించకుండా, సంతోషపెట్టకుండా చేసే క్రియలన్నీ వ్యర్థమవుతాయని మనువు హెచ్చరించాడు.

కపిలమహర్షి తన తల్లి దేవహూతికి తత్త్వోపదేశం చేశాడు. యాజ్ఞవల్క్యుడు తన భార్య మైత్రేయికి ఆత్మతత్త్వాన్ని ప్రబోధించాడు. శిఖిధ్వజుని భార్య చూడాల తన భర్తకు ఆత్మతత్త్వాన్ని బోధించినట్లు యోగవాశిష్ఠం పేర్కొంది. మదాలస తన బిడ్డలకు పునర్జన్మ ఉండరాదని, వారిని చిన్నతనంనుండి నివృత్తిమార్గంలో తీర్చిదిద్దింది. ఆమె ఉగ్గుపాలతో పిల్లలకు 'నీవు శుద్ధుడవు, బుద్ధుడవు, దోషరహితుడవు, సంసార మాయ అంటనివాడవు. ఈ మోహనిద్రనుండి లెమ్ము' అని ఇలా ఆత్మ తత్త్వాన్ని ప్రబోధించింది–

శుద్ధోఽసి బుద్ధోఽసి నిరంజనోఽసి।
సంసారమాయా పరివర్జితోఽసి।
సంసారస్వప్నం త్యజ మోహనిద్రాం।
మదాలసా వాక్య మువాచ పుత్రమ్॥

ఒక తల్లి ఊయలలోని తన బిడ్డలకు ఆత్మతత్త్వాన్నే జోల పాటగా పాడిన సంఘటన ప్రపంచచరిత్రలో మరెక్కడైనా ఉందా? దీన్ని బట్టి ఆ కాలంలో స్త్రీలు ఎంత విద్యావంతులో, మరెంత ఆత్మతత్త్వజ్ఞాన పూర్ణలో గ్రహించవచ్చు. జనకునిసభలో యాజ్ఞవల్క్యునితో వాదించిన గార్గి ఘనత చరిత్రలో చిరస్థాయిగా నిలచిపోయింది. ప్రాపంచిక సౌఖ్యాలను కాదని అమృతత్త్వాన్ని కోరిన భార్య మైత్రేయికి యాజ్ఞవల్క్యమహర్షి చేసిన అమృతోపదేశం అజరామరమైంది. దీన్నిబట్టి ఆ రోజులలో స్త్రీలకు విజ్ఞానపిపాస ఎక్కువగా ఉండేదని తెలుస్తూంది.

యా దేవీ సర్వభూతేషు శక్తిరూపేణ సంస్థితా।
నమ స్తస్యై నమ స్తస్యై నమ స్తస్యై నమో నమః॥





# అప్పలాయిగుంట
# శ్రీ ప్రసన్న వేంకటేశ్వరస్వామివారి
# బ్రహ్మోత్సవం
# 2016 జూన్ 15 నుండి 23 వరకు

**15-06-2016 బుధవారం**

పగలు: ధ్వజారోహణం.

రాత్రి: పెద్దశేషవాహనం.

**16-06-2016 గురువారం**

పగలు: చిన్నశేషవాహనం.

రాత్రి: హంసవాహనం.

**17-06-2016 శుక్రవారం**

పగలు: సింహవాహనం.

రాత్రి: ముత్యపుపందిరివాహనం.

**18-06-2016 శనివారం**

పగలు: కల్పవృక్షవాహనం.

రాత్రి: సర్వభూపాలవాహనం.

**19-06-2016 ఆదివారం**

పగలు: పల్లకీలో మోహినీఅవతారోత్సవం,

రాత్రి: గరుడవాహనం.

**20-06-2016 సోమవారం**

పగలు: హనుమద్వాహనం.

రాత్రి: గజవాహనం.

**21-06-2016 మంగళవారం**

పగలు: సూర్యప్రభవాహనం.

రాత్రి: చంద్రప్రభవాహనం.

**22-06-2016 బుధవారం**

పగలు: రథోత్సవం.

రాత్రి: అశ్వవాహనం.

**23-06-2016 గురువారం**

పగలు: చక్రస్నానం.

రాత్రి: ధ్వజావరోహణం.

# శ్రీ భగవద్రామానుజాచార్యుల

10-05-2016 -



శ్రీ భగవద్రామానుజాచార్యుల వారు



తిరుపతి మహతి కళాక్షేత్రం లో
శ్రీ భగవద్రామానుజ సహస్రాబ్ది ఉత్సవాలను
ప్రారంభిస్తున్న గౌరవనీయులు ఆంధ్రప్రదేశ్ గవర్నరు



తి.తి.దే. శ్రీశ్రీ చిన్నజియర్
ఆధ్యాత్మిక సందేశం

ఆధ్యాత్మిక సందేశం అందిస్తున్న
గౌరవనీయులు ఆంధ్రప్రదేశ్ గవర్నరు

తి.తి.దే. అధ్యక్షుల
ఆధ్యాత్మిక సందేశం





# సహస్రాబ్దిఉత్సవాలు ప్రారంభం

01-05-2017



తిరుమలలో రామానుజ
రథయాత్ర ప్రారంభం



తిరుపతిలో రామానుజ
రథయాత్ర



గ్రంథాలు, సిడిల
ఆవిష్కరణ



తి.తి.దే. కళాకారుల
సంగీత కార్యక్రమం



గవర్నరుకు స్వామి ప్రసాదాలను, జ్ఞాపికను
అందజేస్తున్న తి.తి.దే. ఉన్నతాధికారులు









**ఇటీవల తిరుమలలో తి.తి.దే. నిర్వహించిన**
**సద్గురు శ్రీ త్యాగరాజ స్వామి వారి 249 వ జయంతి మహోత్సవం**



అనారోగ్యంతో ఉన్న భక్తురాలిని
విచారిస్తున్న తి.తి.దే. అధ్యక్షులు



తిరుమలలో భక్తులతో
మాట్లాడుతున్న తి.తి.దే. అధ్యక్షులు

CoverDesignsPainting PSivaprasad10204ChiefEditorOfficeTTDJune2016

# కైంకర్యమే..
# తనువు దాల్చితే....

2

- డా॥ కంపల్లె రవిచంద్రన్, 98487 20478



**(జరిగిన కథ - భగవద్రామానుజులు శ్రీమహావిష్ణువు వరప్రసాదంగా ఆసూరి కేశవ సోమయాజి, కాంతిమతి దంపతులకు జన్మించారు. రామానుజులు జన్మతః జ్ఞాన భాస్కరుడు. అయినా గురువులేనివిద్య గుడ్డివిద్య అన్నట్లు రామానుజులు కాంచీ పురంలో యాదవప్రకాశునివద్ద శిష్యునిగా చేరారు. యాదవప్రకాశుడు రామా నుజుని విజ్ఞానానికి ఈర్ష్య చెంది యాత్ర పేరుతో మార్గమధ్యంలో వారిని తుద ముట్టించాలనుకున్నాడు. )**

యాత్ర సాగుతోంది. మూడవనాటిరాత్రి దుర్గమా రణ్యం చేరుకున్నారు. ఆ రాత్రికి అక్కడే విడిది. అది శుక్లపక్షం. వెన్నెల ఎదుగుతోంది, ఎగజిమ్ముతోంది. గోవిందమిశ్రుడు రామా నుజుణ్ణి దూరంగా ప్రక్కకు తీసుకెళ్లాడు. గంగాస్నానసమయంలో అతని బతుకును గంగపాలు గావించదలచిన గురుపన్నాగాన్ని తెలియపరిచి జాగ్రత్తపడమన్నాడు.

"గోవిందా! అంతావాడిలీల. అందాకావస్తే వరదరాజ స్వామివారు లేరా? వారే నీతో ఇలా చెప్పించారు కాబోలు. అయినా జాగ్రత్తపడదాం" అన్నారు-రామానుజులు.



రాత్రి ఏడుగంటలయింది.

ప్రయాణబడలికతో ఊపిరి ఉసూరుమంటోంది.

భోజనాలు త్వరగా ముగిసాయి.

అంతా గాఢనిద్రలో మునిగారు.

గోవిందుడు-రామానుజులు ఒకచోట పడుకున్నారు. నిద్ర నటిస్తున్నారు.

అర్ధరాత్రి, వెన్నెల కరిగిపోతోంది... చంద్రుణ్ణి మరుగు చేసి చీకటి అలుముకోసాగింది.

గోవిందుడు ప్రాణాలు చెవుల్లో పెట్టుకున్నాడు. చిరు సవ్వడికే కలవరపడిపోతున్నాడు.

రామానుజులు మెల్లగా లేచి, చీకట్లో పడి దక్షిణాభి ముఖుడై వెళ్లిపోయారు.

కొంతసేపయ్యాక ఆ దుష్టశిష్యచతుష్టయం మెల్లగా సోదరులిద్దరూ నిద్రిస్తున్నచోటుకు వచ్చారు.

రామానుజులు లేరు. నిద్రకు స్థలం మార్చాడేమోనని చీకట్లో చుట్టూ చూశారు.

ఊహూ......

ఆనవాలుకూడా అగుపించలేదు.

వారు గోవిందుని నిద్రలేపారు. అతడు అప్పుడు గాఢ నిద్రలో నుంచి అర్థాంతరంగా ఎవరో లేపేసినట్లు చిరాకుగా లేచాడు.

"ఏమిటి? ఇంతరాత్రి ఎందుకు లేపుతున్నట్లు?" విసుక్కున్నాడు.

'రామానుజుడు ఎక్కడ?'

'ఎక్కడేమిటి? ఇక్కడే' అని అతడు పడుకున్న చోటు చూపాడు.

'లేడే' 'అయ్యో! రామానుజునకేమైందో!' అని లేని ఆందోళన తెచ్చుకుని తత్తరపాటును అభినయించాడు.

గోవిందునిగోలకు అందరూ నిద్రలేచేశారు.

గోవిందుడుమాత్రం అన్నప్రాణం దక్కినందుకు, గండం గట్టెక్కినందుకు లోలోపల సంబరపడ్డాడు.

కానీ, అందరితో పాటూ తనూ అన్నట్లు తన అన్నకోసం అంతటా గాలించాడు.

వెదకి వెదకి శిష్యులు విసిగిపోయారు.

ఇదే విషయం శిష్యులు గురువుకు నివేదించారు. ఆయన దీవులెల్లఏలినట్లు, దిగ్విజయంసల్పినట్లు లోలోపల సంబరపడిపోతున్నాడు.

"ఏ క్రూరమృగమో మింగి ఉంటుంది. మనకు ఏ పాపమూ అంటకుండానే మనమనుకున్న పని జరిగిపోయింది. కాగలకార్యం గంధర్వులు తీర్చారు." అని శిష్యులతో అన్నాడు.

గోవిందునితో మాత్రం..

'గోవిందా! విధివ్రాత తప్పించ విధాతవశమా!

ఊరుకో! ఊరుకో!!

చెట్టులో కాసినకాయలన్నీ ఒకే సమయంలో పండి రాలవు కదా!

ఏది ముందో, ఏది వెనుకో, ఎవరికెఱుక!

కనుక అద్వైతులమైన మనం మరణానికి చింతించ రాదు.

ప్రపంచం మిథ్య! మనం ఈ దుఃఖంతో నిరుత్సాహపడి తిరోగమింపకూడదు.

మన యాత్ర కొనసాగవలసిందే!" నని ఏమీ తెలీనివాని వలే యాదవప్రకాశుడు తత్త్వబోధ చేశాడు.

యాదవప్రకాశుడి మహాప్రయాగయాత్ర సాగింది.

యాత్రలు చేసి, చేసిన పాపాలు పోగొట్టుకొంటారు చాలామంది.

పాపం చేయడానికే యాత్రలు చేసేవారు కొంతమంది. ఆ కొంతమందిలో ఒకడైన యాదవప్రకాశుని పన్నాగం ఫలించలేదు, గోవిందమిశ్రుడివల్ల. ఏదిఏమైనా రామానుజుణ్ణి మనకు దక్కించిన గోవిందమిశ్రుడికి సమస్తధార్మికప్రపంచమూ ఆజన్మాంతం ఋణగ్రస్తమే!

ప్రాణం దక్కించుకుని బయటపడ్డారు రామానుజులు.

ఎటుచూసినా అంధకారం.

కొండలు, గుట్టలు, కారడవి. దారి తెన్నూ తెలీడం లేదు.

ఒంటరివాడు.

ఎక్కడా నిలబడలేదు. ఎటునుంచి ప్రమాదం ముంచుకొస్తుందో తెలీదు.

భయంతో ఉన్నవారికి ఇతరమేదీ తోచదు. శరీరం చెమటతో తడిసిపోయింది.

అయినా, తన ఏకాకిత్వానికీ, తన కష్టాలకు అతడు చింతించలేదు. నిరపరాధి అయిన తనను గురువు గారెందుకు ద్వేషించి ఇలా చేశాడనే ఆలోచన అతణ్ణి కుమ్మరిపురుగు తొలిచినట్టు తొలిచివేస్తోంది.

కానీ, ఇలాంటిఆలోచనలకు సమయం కాదది.

ఆ స్థితిలో రామానుజులు, అలిసిపోయి అడుగు ముందుకు వేయలేకపోయారు. వారిప్రమేయం లేకుండానే నేలపై నిద్రలోకి జారుకున్నారు. సుదీర్ఘనిద్ర!

మరునాడు ఎర్రటిఎండలో నిద్రలేచారు.

సమీపంలోని సెలయేటిలో స్నానం చేశాడు.

తనువు, మనసు... రెండూ కాస్త తేలికయ్యాయి.

ఈ లోపల ఎవరో భిల్లదంపతులు అటువైపే వస్తూ, వీరిని చూశారు.

*(ఇంకాఉంది)*

# మడివేలును మన్నించిన మఠాధిపతి

- శ్రీమతి వి.సునంద, 87905 58673



ఒకసారి భగవద్రామానుజులవారు నదిలో స్నానంచేసి, 'తిరుమణి' ధరించి, ఆళ్వార్ తిరునగరిలోని ఆదినాథుని ఆలయంకేసి నడక సాగించారు. వారిచుట్టూ శిష్యులున్నారు. శిష్యగణాన్ని, శిష్యగణం మధ్యగల రామానుజులను చూచి, ఒక రజకుడు పరవశుడయ్యాడు. అతని పేరు ఈరంకొల్లి. అతనికి నలుగురు కొడుకులు. రామానుజులవారిఆశీస్సులు పొందాలని అతనిఆరాటం. తన పిల్లలచేత నమస్కరింపజేయాలని ఉబ లాటం. అందుకే వెంటనే శఠగోపా, కారిమేరా, వకుళాభరణా, కురుగూర్‌నంబి అని కొడుకులు కేసి కేకవేశాడు. ఈ పేర్లన్నీ నమ్మాళ్వారివి. వారు పరుగెత్తుకుంటూ వచ్చారు. రామానుజులు చకితుల య్యారు. ఈ నాల్గుపేర్లు పెట్టడం, ఆ పేర్లతో పిలవడం విని, ఒక్క క్షణం విచార గ్రస్తులయ్యారట. ఆళ్వారుల పేర్లు తన సంతానానికి పెట్టుకొన్న రజకుడు, ఎంత పుణ్యవంతుడో అని పరవశించారు.

రామానుజులవారు పూర్వాశ్రమంలో తన భావాలకు తన భార్య తంజమ్మాళ్ భావాలకు పొసగని కారణంగా సంసారజీవితం త్యజించారు. రజకుడు పిల్లల్ని పేరుపెట్టి పిలవడంతో, 'అయ్యో! నేనే సంసారజీవితం గడిపివుంటే నా సంతానానికి ఈ పేర్లు పెట్టే భాగ్యముండేది కదా! కేవలం కాషాయ వస్త్రధారి కావడంవల్ల ఆ సౌభాగ్యం లేకపోయిం'దని వగచి ఆ రజకుణ్ణి శ్లాఘించారట.

ఆలాగే మరో సంఘటన. ఒక రజకుడు తిరువరంగని (అళగియమణ వాళన్) ఉత్సవవరుల పరివట్టం (పరివేష్టనం) బాగా ఉతికి వాటిని రామానుజుల వారికి చూపించారట. రామానుజులు ఆశ్చర్యచకితులయ్యారు. వెంటనే అతని చేతిని పట్టుకొని గుడికేసి నడిచారు. స్వామిముంగిట నిలబడి రజకుని మనసారా పొగిడి ఉతికిన వస్త్రాలు దర్శించవలసిందిగా ప్రార్థన చేశారు. అపుడు స్వామి ఈ రజకుని పవిత్రకార్యానికి పరవశించి 'ఆనాడు కంసునిరజకుడు నాపట్ల చేసిన అకృత్యాన్ని క్షమించాము' అన్నారట.

ఇందుకు సంబంధించి భాగవతంలో చాకలివాని వృత్తాంతముంది. కంసుడు కృష్ణుణ్ణి చంపాలని ఎన్నోవిధాల ప్రయత్నించి విఫలుడయ్యాడు. చివరకు మధురకే ఆహ్వానించి తుదముట్టించాలనుకున్నాడు. ధనుర్విద్యావిలాస దర్శనార్థం రావాలసిందిగా అక్రూరులద్వారా కబురంపితే బలరామకృష్ణులు ఆలోచించి, అక్రూరునితో నీవు వెళ్ళు. మేము తరువాత వస్తామని బయలుదేరారు. బలరామ కృష్ణులు మధుర ప్రయాణమయ్యారు.

మధురావాసులు బలరామకృష్ణుల రాక విని, పరవశులయ్యారు. కృష్ణుడు వస్తున్నాడని వినగానే అందగత్తెలు అన్నం తింటున్నవారు కంచంవదలి వీధుల్లోకి వచ్చారు. పడుకొన్నవారు ఎవరో తట్టిలేపినట్లుగా పడకనుంచి గబగబా లేచి వాకిలిదాకా వచ్చారు. కృష్ణుణ్ణి చూచి, స్త్రీలు సంతోషంతో మునిగితేలు తుండగా బలరామకృష్ణులు మధుర చేరి నగరద్వారంనుండి వస్తున్న రజకుణ్ణి చూచారు.

"మేము రాజాహ్వానం మేరకు వచ్చిన వాళ్లం. మా మందలలో మాకు కట్టుకోవడా నికి మంచి దుస్తులు లేవు. నీవు మోస్తున్న మూటలో అందమైన వస్త్రాలు కనిపిస్తు న్నాయి. వాటిల్ని పట్రా. మాకివ్వడంవల్ల మీకు సౌభాగ్యంచేకూరుతుంది. మేము కంసు నికి అల్లుళ్ళం. దానివల్ల నీకేం ఇబ్బందులు రావులే" అన్నారు.

రజకునికి కోపం వచ్చింది. ఇష్టం వచ్చినట్లు మాట్లాడాడు. ఆ మాటలకు బల రామకృష్ణులకు కోపం వచ్చి ఆ రజకుడిని ముంజేతితో తల ఊడిపడేటట్లు కొట్టాడు. రజకుడు కిందపడ్డాడు. తన నాయకుడు కిందపడగానే అతనివారి మనుషులు బట్టలు వదలి పరుగెత్తారు. అంతట బలరామకృష్ణులు వాటిలో తమకు కావలసిన దుస్తులు ఎన్ను కొని కొన్ని గోపకులకిచ్చి ముందుకు కది లారు. పరమాత్మ స్వరూపులైన దివ్యమంగళ విగ్రహులైన శ్రీకృష్ణులవారు అడిగినా వస్త్రాలు సమర్పించని పాపం కంసుని రజకునిది. అందుకే అతడు అసువులు బాసాడు. కాని రామానుజుల కాలంనాటి రజకుడు రంగ నాథునికి పరివట్టాలు సమర్పించి స్వామి మెప్పు పొందాడు. మఠాధిపతి మన్ననలు పొందాడు.



పచ్చతోరణం

# వేదపరిరక్షణలో... తిరుమల తిరుపతి దేవస్థానం



– డా॥ సి.శైలకుమార్

భారతీయ సనాతన
సంస్కృతికి మూలం - వేదం.

కొన్ని వేల సంవత్సరాలుగా
అక్షరరూపంగాని,
అచ్చు పుస్తకంగాని లేకుండా...
కేవలం మౌఖికంగా...
ఒక తరం నుంచి
మరొక తరానికి
అందిన అద్భుతజ్ఞానం - వేదం.

శ్రుతిబద్ధంగా,
అనుశ్రుతంగా వేదం
కొన్ని వేల తరాలు
రావడం అందరూ
ఆశ్చర్యపోయే విషయం.

వేదం - నాదజ్ఞానం.

వేంకటేశ్వరుడు వేదవేద్యుడు. ఆర్షధర్మపరిరక్షణలో భాగంగా భగవత్స్వరూపమైన వేదాలను పరిరక్షించి, ముందు తరాలవారికి అందించే లక్ష్యంతో తిరుమల తిరుపతి దేవస్థానములు శ్రీ వేంకటేశ్వర వేదవిశ్వవిద్యాలయాన్ని, అనేక వేదపాఠశాలలను, నిర్వహిస్తూంది.

భగవత్స్వరూపమైన వేదం– లౌకికాలౌకిక జ్ఞానవిజ్ఞాన భాండాగారం. సమూహంగా ఉన్న వేదవాఙ్మయాన్ని సకలమానవాళికి చేరువచేసే దిశగా కృష్ణద్వైపాయన మహర్షి ఋగ్వేద, యజుర్వేద, సామవేద, అథర్వణ వేదాలుగా విభజించి వేదవ్యాసునిగా కీర్తించబడ్డాడు.

ఋగ్వేదం 21 శాఖలుగా, యజుర్వేదం 101 శాఖలుగా, సామవేదం 1000 శాఖలుగా, అథర్వణ వేదం 9 శాఖలుగా విభజింపబడి మొత్తం 1131 శాఖలుగా విస్తరించింది. కాలానుగతంగా ప్రస్తుతం ఋగ్వేదంలో శాకలశాఖ, బాష్కలశాఖలు, యజుర్వేదంలో తైత్తిరీయ, మైత్రాయణీయ, కాణ్వ, మాధ్యందిన శాఖలు, సామవేదంలో కౌథుమ, రాణాయనీయ, జైమనీయశాఖలు, అథర్వణ వేదంలో శౌనక, పిప్పలాదులు వెరసి మొత్తం 11 శాఖలు మాత్రమే పఠన పాఠనాది క్రమంలో లభిస్తున్నాయి.

ప్రపంచ ప్రసిద్ధ ధార్మికసంస్థ తిరుమల తిరుపతి దేవస్థానములు వాడుకలోనున్న ఈ శాఖలను కాపాడుతూ, పోషిస్తూంది. వేదసంపదను భావితరాలకు అందజేసే లక్ష్యంతో 132 సం॥లకు పూర్వమే తిరుమల శ్రీవారి ఆలయప్రాంగణంలో ఒక వేదపాఠశాలను ప్రారంభించింది. ప్రస్తుతం 7 వేదపాఠశాలలు, నిర్వహిస్తూంది. ప్రపంచంలోని మొట్టమొదటి వేదవిశ్వవిద్యాలయాన్ని నెలకొల్పి నిర్వహిస్తున్నది.

## విద్యార్థులకు సౌకర్యాలు

వేదవిద్యాధ్యయనకాలంలో విద్యార్థులకు ఉచితవిద్య, నివాస, భోజన సదుపాయాలతోపాటు ఘనంగా పారితోషికాన్ని కూడా అందజేస్తుంది. వేదవిద్యార్థికి రూ.3,00,000/-, దివ్య ప్రబంధం / ఆగమ / స్మార్త విద్యార్థికి రూ.1,00,000/- పారితోషికంగా విద్యార్థి పేరున చేరిననాడే జమ చేసి, కోర్సును నిర్దిష్ట వ్యవధిలో, విజయవంతంగా పూర్తి చేసినవారికి ఈ డబ్బును వడ్డీతో సహా చెల్లిస్తుంది.

అధ్యయనం పూర్తి చేసుకున్నవారికి శ్రీవేంకటేశ్వర ఉన్నత వేదాధ్యయన సంస్థ ద్వారా ఎంపిక ప్రక్రియలో- దేశంలోని నలుమూలలా వెలసిన దేవాలయాల్లో వేదపారాయణదారులుగా నియమిస్తుంది. తి.తి.దే. దేవాలయాల్లో, వైదిక విద్యాసంస్థల్లో శాశ్వత నియామకాలనుకూడా చేపట్టి, వేదపండితులకు తోడ్పాటునందిస్తుంది.

## శ్రీ వేంకటేశ్వర వేదవిశ్వవిద్యాలయం

వేదవాఙ్మయపరిరక్షణలో భాగంగా 2006 జూలై 7వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర క్యాబినెట్ సమావేశమై తి.తి.దే. సహకారంతో శ్రీ వేంకటేశ్వర వేదవిశ్వవిద్యాలయాన్ని ఏర్పాటుచేయాలని తీర్మానించింది. 2006 సం॥ జూలై 12 న నాటి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గవర్నర్ శ్రీ రామేశ్వర్ ఠాకూర్ గారిచే విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఉత్తర్వులు జారీ చేశారు. తిరుమల తిరుపతి దేవస్థానములు అలిపిరి - చంద్రగిరి బైపాస్ రోడ్డులో 300 ఎకరాల స్థలాన్ని ఈ వేదవిశ్వవిద్యాలయానికి కేటాయించింది. వేదవిద్యను విద్యార్థులకు అందించడంతోపాటు, వేదసదస్సులను నిర్వహించడం, వేదవాఙ్మయాన్ని గ్రంథస్థం చేయడం మున్నగు లక్ష్యాలతో శ్రీవేంకటేశ్వర వేదవిశ్వవిద్యాలయం ఏర్పాటైంది.

శ్రీవేంకటేశ్వరవేదవిశ్వవిద్యాలయం తన విద్యాధ్యయనకార్యాచరణను అధ్యాపక సిబ్బందితో కూడిన మూడు విభాగాలతో 22 జూలై, 2006 న ప్రారంభించింది.

## లక్ష్యాలు

- శ్రుతి సుభగమైన సరైన మౌఖిక సంప్రదాయ పద్ధతిని దృష్టిలో పెట్టుకుని వేదము, ఆగమము మరియు తత్సంబంధిత సహజాత సాహిత్యాన్నీ సంరక్షించడం, పెంపొందించడం మరియు ప్రచారం చేయడం.
- వేదాలను చదవడం, సంస్కృత అధ్యయనమేగాక, వేదాలతో గణితశాస్త్రం, ఖగోళశాస్త్రం, వ్యవసాయం, అంతరిక్షశాస్త్రం, రసాయనశాస్త్రం, మెటలర్జీ, యోగ, మానవీయ సంబంధాల శాస్త్రం, విజ్ఞాన-సాంకేతిక విద్యతో కూడిన సాంఘిక శాస్త్రం నిర్వహణ(మేనేజ్‌మెంట్)ను ఏకీకృతం చేసి, అందులోని వైజ్ఞానిక ఆలోచనలతో కూడిన విద్యను అందించే సదుపాయం కల్పిం చడం.
- ఆధునిక భారతీయ భాషలన్నింటిలోకి వేదాలు మరియు భాష్యాలను అనువదించి, ప్రచురణ చేయడం. వేదపఠనం మరియు వివిధ ఆచారాలకు సంబంధించిన శ్రవణ - దృశ్య రికార్డులను తయారు చేయడం.
- సమాజంలో వేదశాస్త్రాలను ప్రచారం చేయడానికి సెమినార్లు, సమావేశాలు, శాస్త్రార్థగోష్ఠులు నిర్వహించడం.

## శ్రీవేంకటేశ్వర వేదవిశ్వవిద్యాలయం అందించే కోర్సుల వివరాలు

**అ) శాస్త్రి (బి.ఏ.)**

**కాలపరిమితి 3 సం॥లు.**

**ప్రతి శాఖలోను 15 మంది విద్యార్థులకు అవకాశం.**

**1) వేదాధ్యయనక్రమాంత**

ఋగ్వేదం (శాకలశాఖ), కృష్ణయజుర్వేద తైత్తిరీయశాఖ, శుక్లయజుర్వేద (కణ్వశాఖ / మాధ్యందినశాఖ), సామవేద రహ



ఆచార్య కె.ఇ.దేవనాథన్, ఉపకులపతి
















స్యాంత (కౌథుమ / జైమినీయ / రాణాయనీయ శాఖలు), అథర్వ వేదము - పాదాంత (శౌనకశాఖ).

**2) ఆగమాధ్యయన ప్రతిష్ఠాంత**

వైఖానస / పాంచరాత్ర / శైవ.

**3) పౌరోహిత్యాధ్యయన**

షోడశ సంస్కారాంత, ఆశ్వలాయన, ఆపస్తంబ, వైఖానస, పారస్కర.

**4) వేదభాష్యాధ్యయన (విద్యారణ్యభాష్య)**

ఋగ్వేద, కృష్ణయజుర్వేద, శుక్లయజుర్వేద (కణ్వ / మాధ్యందిన), సామవేద, అథర్వవేద.

**5) వేదాంగాలు**

శాస్త్రం - కల్ప (శ్రౌత), మీమాంస.

**అ) ఆచార్య (ఎమ్.ఏ.)**

**కాలపరిమితి 2 సం॥లు.**

**ప్రతి శాఖలోను 15 మంది విద్యార్థులకు అవకాశం.**

**1) వేదాధ్యయన ఘనాంత**

ఋగ్వేద (శాకలశాఖ), కృష్ణయజుర్వేద (తైత్తిరీయశాఖ), శుక్లయజుర్వేద (కణ్వ, మాధ్యందిన శాఖలు), సామవేద లక్షణాంత (కౌథుమ, జైమినీయ, రాణాయనీయ శాఖలు), అథర్వవేద లక్షణాంత.

**2) ఆగమాధ్యయనం**

వైఖానస, పాంచరాత్ర, శైవాగమ.

**3) పౌరోహిత్యాధ్యయనం**

ఆశ్వలాయన, ఆపస్తంబ, వైఖానస, పారస్కర.

**4) వేదభాష్యాధ్యయనం (విద్యారణ్యభాష్య)**

ఋగ్వేద, కృష్ణయజుర్వేద, శుక్లయజుర్వేద, సామవేద, అథర్వవేద, మీమాంస.

**ఇ) విశిష్టాచార్య (ఎం.ఫిల్.)**

వేద, వేదభాష్య, పౌరోహిత్య, ఆగమ, మీమాంస.

**ఈ) విద్యావారధి (పిహెచ్.డి.)**

వేద, వేదభాష్య, పౌరోహిత్య, ఆగమ, మీమాంస.

ఈ విధంగా వివిధ కోర్సులను
పై తెలిపినశాఖల్లో
వేదవిశ్వ విద్యాలయం
ప్రతి ఏడాది నిర్వహిస్తుంది.




- వేదజ్ఞానాన్ని అభివృద్ధి చేయాలనే లక్ష్యంతో మహంతు ప్రయాగదాసు 1884లో ఈ సంస్థను మూడు ముఖ్యశాఖలు-కృష్ణయజుర్వేదం (తైత్తిరీయ), వైఖానసఆగమం, దివ్యప్రబంధంతో, తిరుపతి గోవిందరాజ స్వామి ఆలయంలోని నమ్మాళ్వార్ గుడిలో స్థాపించారు.
- ఋగ్వేద, శుక్ల, యజుర్వేద (కణ్వ), సామవేద (కౌథుమ), పాంచరాత్రాగమ, శైవాగమ, చాత్తాద శ్రీవైష్ణవాగమం, ఋగ్వేదస్మార్తం, కృష్ణయజుర్వేద స్మార్తం, శుక్లయజుర్వేద స్మార్తం, వైఖానస స్మార్తం అనే శాఖలతో ఈ కళాశాల అభివృద్ధి చెందింది.
- తర్వాత అథర్వవేద(శౌనకశాఖ), ఋగ్వేదస్మార్తం, కృష్ణయజుర్వేదశాస్త్రం, శుక్లయజుర్వేదస్మార్తం, వైఖానసస్మార్తం మరియు చాత్తాద శ్రీవైఖానస ఆగమం అనే విషయాలను, ఈ సమయంలో ప్రవేశపెట్టడం జరిగింది. అదేవిధంగా, వేదాధ్యయనానికి, 12 ఏళ్ళు, స్మార్త/ఆగమ, దివ్యప్రబంధం అధ్యయనానికి 8 ఏళ్ళు కాలవ్యవధిని నిర్ధారించడం జరిగింది.
- ప్రాచీనగురుకుల పద్ధతిని స్థాపించడంకోసం, 1992లో తిరుమల ధర్మగిరిలోని 35 హెక్టార్ల స్థలంలో శ్రీవేంకటేశ్వరస్వామి ఒడిలో ఈ కళాశాలను స్థాపించారు.
- వేదాల శాఖలు నష్టపోకూడదనే ఉద్దేశంతో, తి.తి.దే. ఏడు క్రొత్త-కృష్ణయజుర్వేదం (మైత్రాయణి), సామవేద (రాణాయనీయ, జైమినీయ) శ్రౌతం, వైదికాగమం, తంత్రసారాగమం, బోధయానస్మార్తం అనే కోర్సులను 2005లో ప్రవేశపెట్టింది.
- ఈ కళాశాల ప్రాచీనగురుకుల అధ్యయన పద్ధతిలో, 17 విభాగాలు, 54 మంది అధ్యాపకులు, 603 విద్యార్థులతో సంప్రదాయబద్ధమైన అన్ని పరిమాణాలతో చాలా చక్కగా భాసిస్తుంది.

### విషయాలు (సబ్జెక్టులు)

ఎస్.వి.వేదవిజ్ఞానపీఠం, ధర్మగిరి, తిరుమలలో ప్రస్తుతం 17 శాఖలతో విద్యాబోధన జరుగుతున్నది.

### వేదాలు మరియు వాటి శాఖలు

ఋగ్వేదము, కృష్ణయజుర్వేదము (తైత్తిరీయ మరియు మైత్రాయణి), శుక్లయజుర్వేదము (కణ్వ), సామవేదము (కౌథుమ మరియు జైమినీయ), అథర్వవేదము (శౌనక).

### (కోర్సు) విద్యాధ్యయనవ్యవధి

అన్నివేదాలు-12 సం॥ (కృష్ణయజుర్వేదము (మైత్రాయణి) మరియు అథర్వవేదము (7 సం॥) మినహాయించి అన్ని ఆగమాలు, స్మార్తాలు మరియు దివ్యప్రబంధం (8 సం॥)

### దివ్యప్రబంధం మరియు ఆగమ కోర్సులు

వైఖానస ఆగమం, పాంచరాత్రాగమం, చాత్తాద శ్రీవైష్ణవాగమం, శైవాగమం, తంత్రసారాగమం.

### స్మార్త కోర్సులు

ఋగ్వేద స్మార్తం, కృష్ణయజుర్వేద స్మార్తం, శుక్లయజుర్వేద స్మార్తం, వైఖానసస్మార్తం.

# శ్రీవేంకటేశ్వర వేదపాఠశాలు

## విజయనగరం - ఆంధ్రప్రదేశ్

- తి.తి.దేవస్థానములు సామవేద అధ్యయనం కొరకు విజయనగరంలో శ్రీవేంకటేశ్వర వేదపాఠశాలను 2011 అక్టోబరు 6 వ తేదీన ప్రారంభించింది.
- కేవలం సామవేద అధ్యయనంకొరకు ప్రారంభించిన ఈ పాఠశాలలో గౌతమ, రాణాయనీయ, జైమినీయశాఖలలో మొత్తం 45 మంది విద్యార్థులు విద్యను అభ్యసిస్తున్నారు.
- దక్షిణ భారతావనిలో కేవలం సామవేద విభాగంలో 45 మంది విద్యార్థులు అధ్యయనం చేస్తున్న పాఠశాల ఇది ఒక్కటే.
- విజయనగరంలోని యన్.సి.యస్. చారిటబుల్ ట్రస్ట్‌వారు తి.తి.దే.వారికి శాశ్వతంగా కేటాయించిన శ్రీరామనారాయణప్రాంగణంలోని 8 గదుల్లో ప్రస్తుతం తరగతులు నిర్వహింపబడుతున్నాయి.
- విజయనగరం సద్గురు యాజమాన్యం వారు వేదవిద్యాభివృద్ధి కొరకు ఉచితంగా సమర్పించిన 1.80 ఎకరాలలో వేదవిద్యార్థుల ఆవాసం నిర్మించేందుకు 30-10-2015వ తేదీన ఉన్నతాధికారులచే శంకుస్థాపన చేయించడం జరిగింది.

## చిలుకూరు, రంగారెడ్డి జిల్లా, తెలంగాణ

- తి.తి. దేవస్థానములు 2011 సం॥లో చిలుకూరు బాలాజీ ఆలయ సమీపంలో శ్రీవేంకటేశ్వర వేదపాఠశాలను ప్రారంభించింది.
- ఈ పాఠశాలలో కేవలం కృష్ణయజుర్వేదం మాత్రమే నిర్వహింపబడుతూంది.
- ప్రస్తుతం ఈ పాఠశాలలో 10 మంది విద్యార్థులు విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తున్నారు.

## కోటప్పకొండ, గుంటూరు జిల్లా

- గుంటూరు జిల్లా నరసారావుపేట మండలంలోని ప్రసిద్ధశైవక్షేత్రం కోటప్పకొండలో తి.తి.దేవస్థానములు ప్రభుత్వం ఇచ్చిన ఏడు ఎకరాల స్థలంలో 04-10-2015 వ తేదీన శ్రీవేంకటేశ్వర వేదపాఠశాలను ప్రారంభించింది.
- ఈ పాఠశాలలో కృష్ణయజుర్వేదం, కృష్ణయజుర్వేద పౌరోహిత్యం, శైవాగమాలతో పాటు సంస్కృతభాషనుకూడా బోధిస్తున్నారు.
- ప్రస్తుతం వేద విభాగంలో 8 మంది, స్మార్త (పౌరోహిత్య) విభాగంలో 5 మంది, శైవాగమంలో ఇద్దరు మొత్తం 15 మంది విద్యార్థులు విద్యను అభ్యసిస్తున్నారు.

## నల్లగొండ, నల్గొండ జిల్లా, తెలంగాణ

- తిరుమల తిరుపతి దేవస్థానములు 2013 జూలై 5 వ తేదీన నల్లగొండలో శ్రీవేంకటేశ్వర వేదపాఠశాలను ప్రారంభించింది.
- ఈ పాఠశాలలో కృష్ణయజుర్వేదం, శైవాగమం, పౌరోహిత్యం(ఆపస్తంబ) మున్నగు కోర్సులు ఉన్నాయి. కాగా ఈ ఏడాది నుండి పాంచరాత్రాగమం మరియు దివ్యప్రబంధకోర్సులనుకూడా ప్రవేశపెడుతూంది.
- రాష్ట్రప్రభుత్వం ఈ పాఠశాల భవన నిర్మాణం కొరకు నల్లగొండలో ప్రత్యేకంగా 5 ఎకరాల స్థలాన్ని తిరుమల తిరుపతి దేవస్థానములకు కేటాయించింది.
- ప్రస్తుతం ఇక్కడ 45 మంది విద్యార్థులు విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తున్నారు.



వేదపాఠశాల ప్రారంభోత్సవంలో అప్పటి నల్గొండ జిల్లా కలెక్టరు, ప్రస్తుత హెచ్‌డిపిపి, కార్యదర్శి శ్రీ నందివెలుగు ముక్తేశ్వరరావు, ఐ.ఏ.ఎస్.(విశ్రాంత)

## ఐ.భీమవరం, పశ్చిమగోదావరి జిల్లా

- తి.తి.దేవస్థానములు 2011 నవంబరు 12 వ తేదీన తూర్పుగోదావరి జిల్లా ఐ.భీమవరంలో శ్రీవేంకటేశ్వర వేదపాఠశాలను ప్రారంభించింది.
- ఈ పాఠశాలలో కృష్ణయజుర్వేదం, శుక్లయజుర్వేదం, కృష్ణయజుర్వేదస్మార్తం కోర్సులను ప్రవేశపెట్టింది.
- ప్రస్తుతం ఈ పాఠశాలలో ఋగ్వేదం, శుక్లయజుర్వేదం (కణ్వశాఖ), కృష్ణయజుర్వేదం (తైత్తిరీయశాఖ), సామవేదం (గౌతమ, జైమినీయ, రాణాయని) శాఖల్లో మొత్తం 93 మంది విద్యార్థులు విద్యను అభ్యసిస్తున్నారు.

## శ్రీవేంకటేశ్వర వేద సంస్కృత పాఠశాల కీసరగుట్ట, రంగారెడ్డి జిల్లా, తెలంగాణ

- తి.తి.దేవస్థానములు 1981 ఆగష్టు 7వ తేదీన శ్రీభవాని శివదుర్గా సమేత శ్రీరామలింగేశ్వరస్వామి క్షేత్రమైన కీసరగుట్టలో శ్రీవేంకటేశ్వర వేదసంస్కృత పాఠశాలను ప్రారంభించింది.
- దాదాపు 35 సం॥ల చరిత్ర కల్గిన ఈ పాఠశాలలో కృష్ణయజుర్వేదం, శైవాగమం,స్మార్త(ఆపస్తంబ) మున్నగుకోర్సులు ఉన్నాయి.
- ఆంధ్రప్రదేశ్ రాష్ట్రప్రభుత్వం 10 ఎకరాల స్థలాన్ని రంగారెడ్డి జిల్లా కీసరగుట్టలో తిరుమల తిరుపతి దేవస్థానములకు కేటాయించగా 1990లో సొంత నూతనభవనాన్ని తి.తి.దే. నిర్మించింది.
- 1981 నుండి నేటివరకు దాదాపు 300 మంది విద్యార్థులు వివిధకోర్సులను పూర్తిచేసి పట్టభద్రులయ్యారు.
- ప్రస్తుతం కృష్ణయజుర్వేదంలో 41 మంది, శైవాగమంలో 47 మంది, ఆపస్తంబ స్మార్తంలో 47 మంది మొత్తం 135 మంది విద్యార్థులు విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తున్నారు.

## శ్రీ వేంకటేశ్వర వేదిక్ రికార్డింగ్ ప్రాజెక్టు

1980వ సంవత్సరంలో వేదశాఖలను సంరక్షించాలనే సంకల్పంతో తి.తి.దేవస్థాన యాజమాన్యం శ్రీవేంకటేశ్వర వేద రికార్డింగ్ ప్రాజెక్టును స్థాపించింది. ఈ ప్రాజెక్టులో నాల్గు వేదాల్లోని సుమారు 15 శాఖల్ని దేశంనలుమూలల్లోని నిష్ణాతులైన పండితులచే రికార్డింగ్ చేయించింది. వేదాలతోపాటు, శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిష్యం, కల్పం అనే షడంగాలనూ రికార్డింగ్ చేయించారు. వీటి నిడివి మొత్తం 1665 గంటలు. 3673 స్పూల్స్‌లో వీటిని భద్రపరిచారు.

తర్వాతి కాలంలో వీటిల్ని 3286 సీడీల్లో నిక్షిప్తం చేశారు. వీటిల్లో నాలుగువేదాలు, ఆయాశాఖలు ఆంధ్ర, తమిళనాడు, కర్ణాటక, ఒరిస్సా మొదలగు ఆయా ప్రాంతీయ భేదాల్నిబట్టి ఉండే పాఠాలతో పాటుగా – రికార్డింగ్ చేశారు.

వీటిల్లో ఋగ్వేదం గం.450లు, శుక్లయజుర్వేదం గం.295లు, కృష్ణయజుర్వేదం 400 గంటలు, సామవేదం 350గంటలు, అథర్వవేదం 180గంటలు, వేదాంగాలు 15 గంటలుగా మొత్తం 1665 గంటలు రికార్డింగ్ చేయబడ్డాయి.

వీటిల్ని పరిరక్షించడానికై 2014వ సం॥లో తి.తి.దే.వారు శ్రీవేంకటేశ్వర వేదవిశ్వవిద్యాలయంవారికి ఆ బాధ్యతలు అప్పగించినారు. విశ్వవిద్యాలయం ప్రతిష్ఠాత్మకంగా ఈ ప్రాజెక్టును స్వీకరించింది. దేశంలో మరెక్కడాలేనట్టి మిక్కిలి గొప్పదైన రికార్డింగ్‌లైబ్రరీ ఇక్కడ ఉంది. 'ఉపనిషన్మంజరి' అనే 13గంటల నిడివి కలిగిన ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండ, మాండూక్య, తిత్తిరి, ఐతరేయ, ఛాందోగ్య బృహదారణ్యక- అనే 10 ఉపనిషత్తులు విశ్వవిద్యాలయం ప్రాజెక్టుద్వారా విడుదల చేసింది.

ఋగ్వేద బాష్కలశాఖ, కృష్ణయజుర్వేద మైత్రాయణీశాఖ, కృష్ణయజుర్వేద వర్ణక్రమం, శుక్లయజుర్వేద మాధ్యందిన శాఖలు కూడా విడుదల దశలో ఉన్నాయి.

విశ్వవిద్యాలయ ఉపకులపతులైన ఆచార్య దేవనాథన్‌గారు విశ్వవిద్యాలయంలో ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించబడుతున్న శ్రీవేంకటేశ్వరవేదరికార్డింగ్ ప్రాజెక్టుద్వారా అత్యంతప్రాచీనమైన, లుప్తమైపోతున్న వేదశాఖల్ని కాపాడుతూ, వేదాల్లోని ముఖ్యమైన విషయాల్ని సామాన్యప్రజలకుకూడా అందుబాటులోకి తీసుకురావాలనుకొంటున్నామని చెప్పారు.

## శ్రీ వేంకటేశ్వరఉన్నతవేదవిద్య అధ్యయనసంస్థ

**తిరుమల తిరుపతి దేవస్థానములు శ్రీ వేంకటేశ్వరఉన్నతవేదవిద్యఅధ్యయన సంస్థ క్రింద వేద రక్షణకై ఈ క్రింది కార్యక్రమాలు నిర్వహిస్తోంది.**



- ❖ వేదపారాయణపథకం క్రింద దేశవ్యాపితంగా అనేక ఎండోమెంట్ దేవాలయాలలో, ప్రముఖమఠాలలో 86 మంది ఘనా పాఠివేదపండితులు, 1083 మంది క్రమ పాఠి వేదపండి తులు, వేదపారాయణం చేస్తున్నారు.
- ❖ దేశవ్యాపితంగా 92 మంది వృద్ధపండితులు తమ గృహాలలో నమకం మరియు చమకం పారాయణం చేస్తున్నారు.
- ❖ వృద్ధ ఆగమ పండితపథకం క్రింద తెలుగు రాష్ట్రాలలోని 158 మంది వృద్ధ ఆగమపండితులకు ఆర్థిక సహాయం అందజేస్తోంది.
- ❖ అహితాగ్నిపథకం క్రింద తెలుగురాష్ట్రాలలోని 15 మంది అహితాగ్నులకు యజ్ఞయాగాలు చేసేందుకే ఆర్థికసహాయం అందజేస్తోంది.
- ❖ ఇహలోకం విడిచిన 86 మంది వేదపండితుల భార్యలకు ఆర్థికసహాయం అందిస్తోంది.
- ❖ దేశవ్యాపితంగా 84 ప్రైవేటు వేదపాఠశాలలకు ఆర్థిక సహాయం అందిస్తోంది.
- ❖ కుమారఅధ్యాపకపథకం క్రింద 83 మంది విద్యార్థులకు 56 మంది గురువులు వేద విద్య అందిస్తున్నారు.



# ఆలయములు - ఆగమములు

**(రచయిత-** కందుకూరి వేంకటసత్యబ్రహ్మాచార్య, ఎం.ఏ.;
**చరవాణి-**94914 11090; 1/8 డెమ్మీ;
**పుటలు:**32+224+8= 264; **మూల్యం:** రూ.250/-;
**ప్రాప్తిస్థానం:** శిల్పకళాభారతి, శ్రీకామాక్షీదేవీ పూజాపీఠం, విద్యాధరపురం, విజయవాడ- 520 012,
**ఫోన్ నెం:** 0866-2411298; **చరవాణి-**9848577423)

ఈ పుస్తకం ప్రధానంగా శైవాగమవిశేషాల సమన్వయంతో రూపొందినా, ఇతరఆగమవిషయాలనూ ఆయా సందర్భాలలో రచయిత ఉదాహరించి, వాటికీ సముచితస్థానాన్ని నిల్పాడు. 'ఆలయాలు భగవంతుని ప్రతిరూపాలు, అనే విషయాన్ని నిర్ణయించడంలో రచయిత ప్రాచీననవీనవిజ్ఞానాన్ని సమ్మిశ్రితం చేసి, మధురమైన భగవత్సేవామృతాన్ని పాఠకులకు పంచిపెట్టాడు. 71 రకాల చిత్రాలూ ఇచ్చాడు. ఆలయాలు సామాజిక అభ్యున్నతికీ, ఆనందానికీ ఎలా దోహదాలవుతాయో పేర్కొన్నాడు. విగ్రహారాధనతత్త్వాన్ని ప్రామాణికంగా నిరూపించాడు. ఆగమశబ్దార్థాలూ, ఆగమభేదాలూ అందలి భేద సాదృశ్యాలూ చక్కగా పేర్కొన్నాడు. ఆలయనిర్మాణం - విగ్రహ ప్రతిష్ఠ, అందులో తీసుకోవాల్సిన జాగ్రత్తలు, కుంభాభిషేకం, ఆరాధనవిధానాలు, పంచాయతనపూజావిశేషాలూ, ఉత్సవాలూ, వాహనవిషయాలూ, దేవాలయదర్శనం, జీర్ణోద్ధరణ పద్ధతి, ఆవశ్యకత, ఆలయనియమాలు - ఇలా ఆలయాలకు సంబంధించిన ఏ చిన్న విషయాన్నికూడా వదలకుండా- ప్రతి అంశాన్నీ అవసరమైనంతమేరకు వివరించడం - వాక్యవిన్యాసం హృదయానికి హత్తుకొనేటుగా ఉండడం, ప్రామాణికంగా వివరించడం - ఇలాంటి ఎన్నో విశిష్టతల్తో రూపొందిన ఈ పుస్తకం- ఆస్తికులూ, అర్చకులూ, జిజ్ఞాసువులూ, పరిశోధకులూ- అందరూ చదవాల్సిన అపూర్వరచన.

మంచిపేపరుతో, చక్కటి అక్షరాలకూర్పుతో అందంగా ఉండడమేకాక- ఆలయవ్యవస్థను క్షుణ్ణంగా అధ్యయనం చేయడానికి తగిన అంశాలెన్నో ఇందులో ఉన్నాయి. ఇంతమంచి రచన చేసిన శ్రీబ్రహ్మాచార్యగారూ, ఆదరించి ముద్రించిన 'శిల్పకళాభారతి' వారూ అభినందనీయులు.

- డా॥ పమిడికాల్వ చెంచుసుబ్బయ్య

# గ్రంథసమీక్ష

# వేదాంతవాహిని

**(సంకలనకర్త-** బ్రహ్మశ్రీ చంద్రగిరి సుబ్రహ్మణ్యంగారు,
**ప్రాప్తిస్థానం -** యస్.వి.రమణ, బ్రహ్మస్పర్శిని, **ప్రచురణలు-** 21/303, మురుగేశం కాంపౌండ్, ఎస్.ఎఫ్.ఎస్. వీధి, కడప- 516 001; **పుటలు-**240; **మూల్యం-**రూ.250/-)

అన్ని జ్ఞానాలలోనూ ఆత్మజ్ఞానం ప్రధానమైనది. అధ్యాత్మవిద్యవల్లనే అట్టి జ్ఞానం కల్గుతుంది. అందువల్లే గీత భగవంతుడు అధ్యాత్మవిద్యాస్వరూపుడు (అధ్యాత్మవిద్యా విద్యానామ్) అని చెప్పింది.

వివిధవేదాంతశాఖలలో సందేహాలు అత్యధికంగా కల్గుతుంటాయి. అట్టి సంశయాలను తొలగించడానికే శ్రీలక్ష్మణసద్గురువులు 'వేదాంత వాహిని' అనే గ్రంథాన్ని రూపొందించారు.

కీ.శే. శ్రీచంద్రగిరి సుబ్రహ్మణ్యంగారు లక్ష్మణ సద్గురువుల గ్రంథాలను చక్కగా అధ్యయనం చేశారు. అనేక గ్రంథాలను పునర్ముద్రించారు. కొన్నింటిని ఆంగ్లంలో అనువదించారు. వారు లక్ష్మణగురువులు రచించిన గ్రంథాలనుండి సంకలనం చేసి, ప్రచురించిన గ్రంథమిది.

మొదట 1990లో ముద్రితమైన ఈ గ్రంథం ఇప్పుడు పునర్ముద్రణ పొందింది. దీన్ని శ్రీ సుబ్రహ్మణ్యంగారి కుమారుడు - శ్రీ యస్.వి.రమణగారు ప్రచురించారు. గురుశిష్యలక్షణాలు, సాధనచతుష్టయం, పంచీకరణం, గుణత్రయం, శరీరత్రయం, పంచవిచారం - మున్నగు ఆధ్యాత్మిక విషయాలపై కలిగే సందేహాలకు ప్రమాణపూర్వకంగా ఇందులో సమాధానాలు వివరింపబడినవి. వేదాంతవిద్యావ్యాప్తికీ, అవిద్యలో కలిగే సంశయాల నివరణకూ ఈ గ్రంథం ఎంతగానో ఉపకరిస్తుంది.

- డా॥ సముద్రాల లక్ష్మణయ్య

# వేదభాష్యాలు - భాష్యకారులు



- కీ.శే. ఆచార్య ఎస్.బి. రఘునాథాచార్య

చరిత్రకందని కాలంనుంచి వేదార్థాలు తెలుసుకొనేందుకై ఎన్నెన్నో భాష్యాలు, వ్యాఖ్యానాలు, ఉపవ్యాఖ్యానాలు ఏర్పడి, కొన్ని ప్రచారంలో ఉన్నాయి. ఇంకొన్ని కాలగర్భంలో కలిసిపోయాయి. అది కాలసహజమైనలక్షణం. ఇప్పటికీ మనకు దొరుకుతున్న వివరాలనుబట్టి సుమారు 25 మంది భాష్యకారులున్నట్లు తెలుస్తూంది.

### యాస్కుడు

వేదంలోని నిగూఢార్థాలుకల పదాలను సంకలనం చేసి, ప్రాచీనాచార్యులెవ్వరో నిఘంటువును తయారు చేశారు. దానికి వ్యాఖ్యానంలాంటిదే యాస్కునినిరుక్తం. ఈనాడు భాషాశాస్త్రాలపైన జరుగుతున్న తర్జనభర్జనలకు ఇది ముఖ్యాధారం.

## ఋగ్వేద భాష్యాలు

### 1) స్కందస్వామి

యాస్కునితర్వాత అదే ఒరవడిలో ఋగ్వేదానికి భాష్యం వ్రాసినవాడు స్కందస్వామి. ఇప్పటికి దొరుకుతున్న ఋగ్వేదభాష్యాల్లో ఇదే మొదటిది. ఇతనిభాష్యం యజ్ఞ పరమైంది. ఋక్సంహితకు ప్రథమాష్టకానికి పూర్తి భాష్యం దొరుకుతూంది.

### 2) నారాయణాచార్యుడు

ఇతడు స్కందస్వామికి భాష్యరచనల్లో సాయం చేసినవాడు. ఋక్సంహితలోని ఐదు, ఆరు, ఏడు అష్టకాలకు అక్కడక్కడ భాష్యం వ్రాశాడు.

### 3) ఉద్గీథాచార్యుడు

వేదభాష్యకారులలో గొప్పప్రసిద్ధ కలవాడు ఇతడు. కానీ ఋక్సంహితకు ఈయన భాష్యం పదవమండలంలోని అయిదవసూక్తంనుంచి ఎనభైమూడవసూక్తంవరకే దొరకుతూంది.

### 4) హస్తామలకుడు

ఇతడు ఎనిమిదవశతాబ్దంవాడు. ఋగ్వేదభాష్య కారుడుగా ప్రసిద్ధి ఉంది కానీ ఆ గ్రంథం ఇంతవరకు దొరకలేదు.

### 5) వేంకటమాధవుడు

కౌశికగోత్రుడైన వేంకటమాధవుడు కావేరీప్రాంతం వాడు. ఇతనితల్లిదండ్రులు సుందరీవేంకటాచార్యులు. పదవశతాబ్దంలో ఇతడు ఋక్సంహితకు 'ఋగర్థదీపిక' అనే భాష్యం వ్రాశాడు. ఇదికూడా యజ్ఞపరమైన భాష్యమే!

### 6) లక్ష్మణాచార్యుడు

ఇతడు ఋక్సంహితకు 'వేదభూషణమ్' అనే భాష్యం వ్రాశాడు. అది ఇంకా వెలుగు చూడలేదు. పన్నెండవశతాబ్దంలో ఇతడున్నట్లు చెబుతారు.

**7) ఆనందతీర్థుడు**

ద్వైతసంప్రదాయప్రవర్తకుడైన మధ్వాచార్యుడే ఆనందతీర్థుడు. 13వ శతాబ్దంలో (1198-1270) కర్ణాటకంలో ఉండిన ఈయన ఋక్సంహిత ప్రథమ మండలంలోని మొదటి 40 సూక్తాలకు దిగ్దదర్శనంగా ఏకదేవతావాద పరమైనభాష్యం వ్రాశాడు. పరమేశ్వరుడైన విష్ణువే సకలవేదప్రతిపాద్యుడని ఈయనసిద్ధాంతం.

**8) ఆత్మానందతీర్థుడు**

ఋక్సంహిత ప్రథమమండలంలోని 40 సూక్తాలకు ఈయన భాష్యం వ్రాశాడు.

**9) ముద్గలాచార్యుడు**

ఇతడు వ్రాసిన ఋక్సంహితాభాష్యం ప్రథమాష్టకానికి అయిదవఅధ్యాయంవరకు దొరుకుతూంది. ఇతడు 15వ శతాబ్దంవాడు. సాయణభాష్యానికి సంగ్రహరూపమే ఇతనిభాష్యం.

**10) దేవస్వామి**

ఇతడు ఋక్సంహితకు భాష్యం వ్రాసినట్లు ప్రసిద్ధి.

**11) చతుర్వేదస్వామి**

ఋక్సంహితలో కొన్నిభాగాలకు కృష్ణపరమైన భాష్యం ఈయన వ్రాశాడు.

### యజుర్వేదభాష్యాలు

**1) భట్టస్వామి**

ఇతడు చాలా ప్రాచీనుడైన భాష్యకారుడు. ఇతడు తైత్తిరీయసంహితకు వ్రాసినభాష్యం ఇప్పుడు దొరకడంలేదు.

**2) భట్టభాస్కరుడు**

యజుర్వేదభాష్యకారులలో ప్రసిద్ధుడైన ఈయన పదకొండవశతాబ్దంవాడు. సాయణుడు ఇతనిభాష్యాన్ని చాలచోట్ల ఉదాహరించాడు.

**3) దుర్గాచార్యుడు**

పదహైదవ శతాబ్దపువాడైన దుర్గాచార్యుడు తైత్తిరీయసంహితకు భాష్యం చేశాడు.

**4) ఉవటుడు**

ఇతడు పదకొండవశతాబ్దంలో భోజరాజుపాలనలో అవంతీనగరంలో ఉండేవాడు. శుక్లయజుస్సంహితకు పూర్తిగా ఈయన భాష్యం దొరుకుతూంది.

**5) మహీధరుడు**

ఇతడు శుక్లయజుస్సంహితకు వ్రాసిన భాష్యం పూర్తిగా దొరుకుతూంది. ఇతడు 'మంత్రమహోదధి' అనే తంత్రశాస్త్రగ్రంథంకూడా వ్రాశాడు.

**6, 7) భవస్వామి - గుహదేవుడు**

వీరిద్దరు తైత్తిరీయసంహితకు భాష్యాలు వ్రాశారు.

### సామవేదభాష్యాలు

**1) మాధవుడు/ భరతస్వామి/గుణవిష్ణువు**

వీరు ముగ్గురు సామవేదానికి భాష్యాలను వ్రాశారు.

### బహుభాష్యకారులు

**1) సాయణాచార్యుడు**

ఋగ్వేదం, కృష్ణయజుర్వేదం, శుక్లయజుర్వేదం, సామవేదం, అథర్వవేదం-వీటన్నింటికీ సంప్రదాయబద్ధమైన

భాష్యాలు వ్రాసి, అనన్యసాధారణమైన కీర్తిప్రతిష్ఠలు గడించినవాడు.

### 2) ధానుష్కయజ్వ

ఈయన ఋగ్యజుస్సామవేదాలకు భాష్యాలు చేశాడు.

### 3) రావణుడు

ఋగ్వేదానికి, యజుర్వేదానికి అధ్యాత్మార్థప్రధానమైనభాష్యం వ్రాశాడు.

### 4) స్వామి దయానందసరస్వతి

ఆర్యసమాజస్థాపకుడైన దయానందుడు యజుర్వేదానికి పూర్తిగాను, ఋగ్వేదానికి 7వ మండలంవరకు భాష్యం వ్రాశాడు.

### 5, 6) హలాయుధుడు - అనంతాచార్యుడు

ఈ ఇద్దరూ వేదభాష్యాన్ని వ్రాసినట్లు ప్రసిద్ధి.

## సాయణుడు-ఆయన భాష్యాలు

మాయణ-శ్రీమతుల నోములపంట సాయణుడు. ఇతనిఅన్న మాధవుడు. ఆయనే సన్న్యాసం తీసుకొని, విద్యారణ్యస్వామియై హరిహరరాయలు బుక్కరాయలు ద్వారా విజయనగరసామ్రాజ్యాన్ని స్థాపింపజేశాడు. తమ్ముడు భోగనాథుడు. ఇతడు సంగమరాజుకు అంతరంగసచివుడు. వీరు ముగ్గురూ వేదవేదాంగాలలో నిష్ణాతులు. ఇతడు భారద్వాజగోత్రుడు, బోధాయనసూత్రుడు, కృష్ణయజుర్వేది అయిన ఆంధ్రబ్రాహ్మణుడు.

క్రీ.శ.1315లో పుట్టి, 1387 దాకా జీవించిన సాయణుడు హరిహరబుక్కరాయల ఆస్థానంలో ఉండేవాడు. బుక్కరాయలు రాజగురువైన మాధవాచార్యుణ్ణి (విద్యారణ్యుణ్ణి) వేదాలకు భాష్యాలు వ్రాసి, వేదార్థాన్ని ప్రకాశింపజేయమని ప్రార్థించాడు. అందుకు నా తమ్ముడు సామ్రాజ్య ధురంధరుడైన సాయణుడు సమర్థుడని మాధవుడు చెప్పగా- రాజు సాయణుణ్ణి వేదభాష్యాలు వ్రాయడానికి ఉపక్రమించమని ప్రార్థించాడు. బుక్కభూపతిప్రేరణతో సాయణాచార్యుడు ఈ క్రిందిసంహితలకు, బ్రాహ్మణాలకు భాష్యాలు వ్రాశాడు.

1) తైత్తిరీయసంహిత (కృష్ణయజుర్వేదం)
2) ఋక్సంహిత
3) సామసంహిత
4) కాణ్వసంహిత (శుక్లయజుర్వేదం)
5) అథర్వసంహిత

కృష్ణయజుర్వేదానికి సంబంధించిన 1)తైత్తిరీయబ్రాహ్మణం, 2)తైత్తిరీయారణ్యకం; శుక్లయజుర్వేదానికి సంబంధించిన 3)శతపథబ్రాహ్మణం; ఋగ్వేదానికి సంబంధించిన 4)ఐతరేయబ్రాహ్మణం 5)ఐతరేయారణ్యకం; సామవేదానికి సంబంధించిన; 6)తాండ్య(పంచవింశ), 7)షడ్వింశ, 8)సామవిధాన, 9)ఆర్షేయ, 10)దేవతాధ్యాయ 11)ఉపనిషత్, 12)సంహితోపనిషత్, 13) వంశబ్రాహ్మణాలు.

వైదికవాఙ్మయంలో సాయణుడు చేసినకృషి అద్వితీయం, అనన్యసాధారణం.



:: 07 - సమాధానాలు ::

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | 1 స | 2 ర | సి | 3 జ | భ | 4 వు | డు | |
| 5 సు | | శ్మి | | న్ని | | గో | | 6 ఖ |
| 7 మ | హి | | 8 వ | ద | నం | | 9 ధ | ని |
| తి | | 10 సం | | ము | | 11 ప్ర | | జం |
| | 12 వి | భ | వం | | 13 శాం | భ | వి | |
| 14 పి | | వం | | 15 ఆ | | వ | | 16 కు |
| 17 నా | కం | | 18 సు | వ | ర్ణం | | 19 మో | ము |
| కి | | 20 తా | | ర | | 21 తా | | దం |
| | 22 శ | ర | వ | ణ | భ | వు | డు | |

# పుట్టగానే... పరిమళించిన భక్తికుసుమం

3

# శ్రీ జనాబాయి

-డా॥ పోరంకి దక్షిణామూర్తి

**పాండురంగ విఠ్ఠలుని దర్శనార్థం పండరీపురంలోనే ఉండిపోయిన జనాబాయిలోని దివ్యతేజస్సుకు పరమభాగవతోత్తముడైన నామదేవుడు ముగ్ధుడై ఆమెకు సన్నిహితుడైనాడు.**

**ఆ తర్వాత.....**

ఇలా ఏర్పడ్డ పరిచయంతో నామదేవుడు చిట్టితల్లికీ, పెద్దావిడకూ సన్నిహితుడు అయ్యాడు. అప్పుడప్పుడు తన ఇంటికి తీసుకువెళ్ళి పండ్లు, భోజనం పెట్టి, భాగవతసేవగా తలచి సంతోషిస్తూ ఉండేవాడు.

పదిరోజులు గడిచిపోయాయి. పెద్దావిడ పండరిపురం విడిచి,సొంత ఊరికి వెళ్ళడం ఒక సమస్య అయిపోయింది. వెళ్దామంటే జనాబాయి రానంటోంది. మా అమ్మా నాన్నా ఇక్కడే ఉన్నారంటుంది. ఏం చెయ్యడానికీ ఆమెకు పాలుపోలేదు. తన సమస్య నామదేవుడికి చెప్పి, పిల్లను ఎలాగయినా ఒప్పించమంది. ఆయన చెప్పాడు. కాని జనాబాయి ఒక్కటే మాటమీద నిలబడింది. "పాండురంగడు నా తండ్రి; రుక్మిణమ్మ నా తల్లి. వాళ్ళు ఉన్నచోటు విడిచి, నేను ఎక్కడికీ వెళ్ళను." అంటుంది. ఆయనకిక ఏం చెప్పడానికీ పాలు పోలేదు.

"నిజంగా ఈ పిల్లకు పాండురంగడిమీద ఎంతగొప్పభక్తి కుదిరింది! ఇది కావాలంటే వచ్చేదా? ఇటువంటి బిడ్డను కన్నందుకు ఆ తల్లి దండ్రులు సంతోషించాలి. పుణ్యఫలంగా భావించాలి. కనుక, అమ్మాయిని ఇక్కడే ఉండ నివ్వండి. మా ఇంట్లో ఉంచండి. మీరు తిరిగి వెళ్ళి, చిట్టి తల్లి తల్లిదండ్రులకు నచ్చజెప్పండి," అన్నాడు - నామదేవుడు.

కానీ, పెద్దావిడకు ఆ సలహా నచ్చలేదు. పిల్లను తనతోబాటు తీసుకు వచ్చి, అప్పజెబుతానని మాట ఇచ్చింది. ఆ మాట వృథా కాగూడదు. అందువల్ల మరికొన్నాళ్లు చూచి, పిల్లను ఒప్పించడానికి ప్రయత్నించాలని నిశ్చయించుకుంది.

మరి రెండురోజులకు జనాబాయితండ్రి కూతురికోసం పండరి పురం వచ్చాడు. పెద్దావిణ్ణి కలిశాడు. చిట్టితల్లిని పలకరించాడు. "ఇంటికి పోదాం ర"మ్మన్నాడు. "అమ్మ నీకోసం బెంగపెట్టుకుంది," అన్నాడు. 'ససేమిరా' అంది - జనాబాయి. మంటపంలో కళ్లు మూసుకొని కూర్చుంది. ఎంతసేపటికీ కళ్ళు విప్పదాయె! అతడు దైవభక్తి లేనివాడేమీ కాదు. ధ్యానానికి భంగం కలిగించడం మంచిది కాదనీ తెలుసు. అటువంటి సమాధిస్థితి కలగడం ఎన్నిజన్మల్లోనో సాధన చేస్తేనే కాని అలవడేది కాదనీ తెలుసు.




కానీ కడుపుతీపి! కన్నకూతురిని ఇక్కడ విడిచి ఎలా వెళ్ళగలడు? ఈ చింతలో అతడు మునిగి ఉండగా నామ దేవుడు అక్కడికి వచ్చాడు. పెద్దావిణ్ణి పలకరించాడు. చిట్టి తల్లితండ్రిని ఓదార్చాడు. ఆమెను తన ఇంట్లో పెట్టుకొని కన్నబిడ్డలా చూసుకొంటాను అనీ, అదే దైవసంకల్పంగా కనిపిస్తోందనీ చెప్పి, "పెద్దావిణ్ణి తీసుకొని నిశ్చింతగా మీ ఊరికి వెళ్ళండి. కావాలన్నప్పుడు వచ్చి, మీ బిడ్డను చూసుకొని వెళ్ళండి. మరేమీ దిగులు పడకండి," అని

అతనికి నచ్చజెప్పాడు నామదేవుడు–వాళ్ళిద్దరినీ సాగనంపి చిట్టితల్లిని తన ఇంటికి తీసుకువెళ్ళాడు. గుమ్మంలో తల్లి కనిపించింది.

"అమ్మా! జనాబాయి పండరిపురం విడిచి వెళ్ళనంటోంది. పాండురంగడి అంతరంగభక్తురాలు! ఇక మనింట్లోనే ఉండి, భగవంతుణ్ణి పూజించుకుంటుంది," అన్నాడు – నామదేవుడు గుణాబాయితో.

"దానికేం భాగ్యం! రమ్మను నాయనా! మన పిల్లల తోటి తనూను," అంటూ చెయ్యి పట్టుకొని లోపలికి తీసుకు వెళ్ళి, జనాబాయిసంగతి కోడలికి మనుమలకూ చెప్పింది. అందరూ ఆమెతో ఆప్యాయంగా మాట్లాడారు.

అక్కడికి వచ్చినప్పటినుంచి జనాబాయి, ఇన్నాళ్ళుగా తను చేస్తూ వచ్చిన భజన, నామజపం, ధ్యానం చేసుకొంటూ ఆనందంగా కాలం గడుపుతోంది. పాండురంగడి ఆలయానికి వెళ్ళినప్పుడు ఆయనవిగ్రహాన్నే చూస్తూ– గంటలకు గంటలు గడిపేది. ఇతరవేళల్లో గుణాబాయి కానీ, కోడలు రాధాబాయి కానీ ఇంట్లో పనులు చేసుకొంటున్నప్పుడు అప్పుడప్పుడు తనుకూడా చిన్నచిన్న పనులు చేస్తూండేది.

ఇలా కాలం గడుస్తూ ఉండగా ఒకనాడు ఊళ్ళో ఉరుములూ మెరుపులతో పెద్ద గాలివాన వచ్చింది. చిమ్మచీకట్లో హోరున వర్షం పడింది. అక్కడక్కడ చెట్లు కూలిపోయాయి. గుడిసెల కప్పులు లేచిపోయాయి. ఊరు ఊరంతా విలవిల్లాడిపోయింది.



నామదేవుడు తలుపు తీసుకొని, వీధి గుమ్మంలో నిలబడ్డాడు. చుట్టూ అంధకారం. అయినా ముంగిట్లో కొద్దిగా వెలుతురు పడుతోంది. ప్రహరీగోడ కొంత కూలిపోయినట్లు కనిపించింది. గోడకు అవతల ఎవరో మసలుతున్నట్లు కూడా కనిపిస్తోంది. నామదేవుడికి ఆశ్చర్యం కలిగింది.

నామదేవుడిఇల్లు మరీ చిన్నది కాదు కానీ పైన పూరి కప్పిన ఇల్లు ముంగిట్లోకి రెండడుగులు వేసి ఇంటి పైకప్పు కేసి చూశాడు. ఆశ్చర్యం! పై కప్పు ఇంటిగోడలమీద నిలిచి ఉండలేదు; బారెడెత్తు పైకి లేచి గాలిలో నిలకడగా ఉంది! దానికి ఎగువన భారీఉరువులో ఒక పెద్దచక్రం ఏదో తిరుగుతున్నట్లు ఉంది. అది ఇంటిచుట్టూ వెలుగులు విరజిమ్ముతోంది!

ఆ దృశ్యం చూస్తూ ఉంటే నామదేవుడికి నోట మాట రాలేదు. కళ్ళవెంట ఆనందబాష్పాలు వచ్చాయి. "శ్రీహరీ! పాండురంగా! ఈ దాసుడిమీద ఎంతదయ చూపిస్తున్నావయ్యా! నీ సుదర్శనచక్రాన్ని వానకు అడ్డువేశావా తండ్రీ? కప్పు కూలిపోకుండా గాలిలో నిలిపావా! పుండరీకవరదా! పండరినాథా!" అంటూ చేతులెత్తి నమస్కరించాడు. గోడ అవతల అలికిడి కాగానే చటుక్కున అటు వెళ్ళాడు. కూలిపోయిన గోడభాగంలో ఇటుకలు పేర్చి, బెండడి పెట్టి చక్క జేస్తున్న వ్యక్తి కనిపించాడు. నామదేవుడు ముందుకు ఉరికి, ఆ వ్యక్తిచేతులు పట్టుకున్నాడు. ఆ వ్యక్తి మామూలుగా అందరిలాంటి వాడిలాగానే కనిపించాడు. అయినా నామదేవుడికి తెలుసు–

"శ్రీహరీ! నువ్వా తండ్రీ! నాకోసం వచ్చావా! ఇంతశ్రమ తీసుకుంటున్నావా! వద్దు ప్రభూ! ఈ దాసుణ్ణి మనసులో పెట్టుకున్నావు. అంతే చాలు! నువ్విలా కష్టపడుతూంటే నేను చూడలేను. ఇక రా! నా ఇంటిని పావనం చెయ్యి!" అంటూ ఆయన్ని చెయ్యి పట్టుకొని నడిపించి, చేతులూ కాళ్ళూ కడిగి లోపలికి తీసుకువెళ్ళాడు. *(ఇంకా ఉంది)*

# వేదములు దెచ్చినట్టి విభునికి శరణు

ఆచార్య కె.సర్వోత్తమరావు, 97041 04000



సనాతన ధర్మానికి 'వేదం' ఆయువుపట్టు. వేదం మొదట ఒకటైనా, తర్వాత మూడైనా, ఆ తర్వాత నాలుగైనా భారతీయులకు వేదాలపట్ల గల గౌరవం అసమానం. ఆ వేదాలను అనుసరించి, ఉపనిషత్తులు, స్మృతులు, ఆగమాలు, పురాణేతిహాస కావ్యవాఙ్మయమంతా వటవృక్షంలా పెరిగింది. ప్రత్యేకించి - ఆంధ్రులకున్న వేదాభిమానానికి ఇంటిపేర్లలో చతుర్వేదుల. ద్వివేదులలాంటివి ప్రత్యక్షసాక్ష్యాలు. వర్ణాశ్రమధర్మాలు నియతంగా పాటించే కాలంలో వేదాధ్యయనం కొందరికి నియతమని చెప్పడంలో తప్పేమీలేదు. వేదపఠనం, వేదాధ్యయనం, వేదఅధ్యాపనం, వేదోచితంగా జీవితం గడపడం లాంటివి కొందరికి పుట్టుసొమ్ములు. ఆలాంటి కుటుంబంలో జన్మించిన వాడు - అన్నమయ్య.



అన్నమయ్య స్మార్తుడు. నందవరీకులు. ఋగ్వేదులు. స్మృతుల కనుగుణమైన ధర్మాలను ఆచరించే స్మార్తకులంలో జన్మించినవాడు. వేదవిహితమైన ప్రవృత్తి నివృత్తి మార్గాలను. ఆ ధర్మాలను అనుసరించే బ్రాహ్మణవర్గీయుడు. అంతేకాదు అన్నమయ్య పితామహుడు–

పంచిన చోటెల్లఁ బదమును గ్రమము
కొంచిక కతదు గ్రక్కున జెప్పి మఱియు
క్రమ శిఖ జటయు వర్ణక్రమసరణి
బ్రమయక నిజవేదపాఠంబు సలిపిన ఘను దని

అన్నమాచార్యచరిత్ర స్పష్టం చేస్తున్నది.

పోతనలాగే అన్నమయ్య సహజపాండిత్య శోభితుడనడం సమంజసం. ఆదివన్ శఠగోపయతుల దగ్గర అన్నమయ్య ద్రావిడాగమాలరహస్యాలు తెలుసుకొన్నాడనడం– అవతార పురుషుడైన శ్రీకృష్ణుడు సాందీపని దగ్గర విద్యలు నేర్చుకోవడం లాంటిదే! అన్నమయ్య నందగోపనందనుడు రేపల్లెలో పెరిగిన రీతులను వర్ణిస్తూ...

'ముచ్వంక వేదములను ముద్దుమాటలాడనేర్చె' అనడం అన్నమయ్యకు సరిపోయే అంశం కావచ్చు. అంతేకాదు. 'నీ కథామృతము నిరతసేవన మాకు' అనే కీర్తనలో

'ఇదియె వేదసంహిత మంత్రరాజము నాకు నే ప్రొద్దు నిదియె వేదసంహితపాఠము' (1.54) అని చెప్పాడు.

అన్నమాచార్యులకున్న 'వేద' అభిమానం అనంతం. అపారం. వేంకటేశ్వరుణ్ణి గురించి వర్ణించే సందర్భాలలో అన్నమయ్య తప్పక 'వేదశబ్దం' వాడతాడు.

వేదమయుడు కోవిదు దమలుడు పరు
దాదిపురుషుడు మహామహుడు (1.333)

ఏకో నారాయణుడవు నీవని
యెన్నుచు నున్నవి వేదములు (4.103)

వేదమూరితి యితడు విష్ణుమూరితి యితడు (4.249)

తిరుమల వేంకటేశ్వరుడు అన్నమయ్యకు అర్చావతార మూర్తి కాదు– ఏకవింశతి అవతారాలెత్తిన విష్ణువే! ఈ భావాన్ని అనేకచోట్ల వివరించిన సందర్భాలు.

వేదుక నజుడు చెప్పె వేదముగా నీవు తొల్లి
వోదక మీనై కొన్నాళ్ళుండితి వంటా (2.162)

అన్నమయ్యకు కనబడిన కొండకూడా 'వేదములే శిలలై వెలసిన కొండ'. స్వామి పరబ్రహ్మ కనుక ఆ పరబ్రహ్మస్వరూప నిరూపణలో వేదాలు అశక్తాలని అన్నమయ్యభావన. అందుకే

చేరి వేదములు నిన్ను జెప్పగా వినుటే కాని
నీ రూపము దర్శించే వారవెవ్వరు (2.303)

ఎదలో నుండుదు వని యిన్నివేదాలు చెప్పగా
వెదకి ధ్యానము సేతు వెస ననుకొంట లేదు (3.210)

అన్నమయ్యకు తిరుమలలో జరిగే ఉత్సవాలన్నిటిలో వేదాలే గుర్తుకు వస్తాయి. స్వామిపుష్కరిణిలో జరిగే తెప్పల తిరునాళ్ళను దర్శించి, 'అర్మిలి నాలుగువేదాలదె నీ దరులు' (2.426) అని వేదాల్ని రక్షించిన స్వామిలాగే పుష్కరిణి వేద తుల్యమని. చతుర్విధపురుషార్థప్రదాయిని అని చెప్పక చెప్పి నాడు. డోలోత్సవం దర్శించేవేళల్లోకూడా

పదిలముగ వేదములు బంగారు చేరులై
పట్ట వెరపై తోచె నుయ్యాల (1.67) వేదాలే గుర్తు కొచ్చాయి. రథోత్సవం సాగుతుంటే ఇందిరయు, తాను కూడి 3.146 కీర్తనలో

వేదములే గుఱ్ఱములు విష్ణునిరథమునకు
వాదపుశాస్త్రములే తీవ్రపుపగ్గాలు అన్నాడు.

అన్నమయ్యకు, అన్నమయ్యకుటుంబానికీగల వేదాను రక్తికి

జ్ఞానమే మాకు ధనము
సర్వవేదములు సొమ్ము (3.63) వాక్యాలు సాక్ష్యాలు. పరమాత్మముందు జీవుడు అనామకుడు. అందుకే అన్నమయ్య

వేదములనేటి యంగడివీథి
నన్ను చూచేవారు లేరు నవ్వేటివారు లేరు
వన్నెల సముద్రములో వానలాయ బ్రతుకు (2.6)

అన్నమయ్యకు వేదోక్తంగా పూజలు చేసేవారిపట్ల చాల గౌరవముంది. వైఖానసులు, ఆలాగే వైష్ణవులు వేగవేగ గుడికి వచ్చే తీరును 'నాలుగు ఘడియ లనగ వేదవేద్యులు లేచి, సరగున ఆగమోక్తవిధులను తమదేహానుగుణములుగా వేగమున సంధ్యాదులొగి కావించి' 4.45 అని వర్ణించాడు. ఆలాగే వేదమంత్రములు చదవకుండా నటించేవారిని చూచి,

"వేదఘోషణము విడువక సేయుదు" (1.12) అంటూ

వేదములు దెచ్చిన శ్రీవేంకటేశ నేము నీకు
వేదమంత్రముల పూజావిధి సేసేమా (4.45) అనడం.

అర్చకులు, పర్యవేక్షకులు, వీక్షకులు ఆలోచించుకోవలసిన అంత రార్థం. ఆలాగే వేదాలు చదివేవారికి వేదప్రయోజనం అవగతం కావాలని అన్నమయ్యకోరిక. అందుకే

అరయ వేదాధ్యయన మది బ్రహ్మశుద్ధికొఱకు (2.34)
అంటూ

వేదవిజ్ఞానము విరతియే కోరు (4.107) అని స్వానుభవాన్ని చెప్పాడు. వేదాన్ని, వేదపఠనాన్ని ఎంతగా శ్లాఘించినా, వేదపండితులలో మార్పును ఆశించినవాడు అన్నమయ్య. అందుకే

వేదములు చదివియును విముఖుడై హరిభక్తి
యాదరించని సోమయాజికంటె
యేదియును లేని కులహీనుడైనను విష్ణు
పాదములు సేవించుభక్తుడే ఘనుడు (1.318)
అన్నాడు.

అన్నమయ్య వేదానురక్తిని, సంకీర్తనలలోని వేదసారాన్ని గుర్తించిన తాళ్లపాక కుటుంబీకులు

'సకలవేదములు సంకీర్తనలు చేసి
ప్రకటించి నిను బాడి పావనుడైన అకలంకుడు' అని అన్నమయ్యను శ్లాఘించారు.

ఆలాగే

శ్రుతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై
...... ....... ....... ...... ......
నుతులై తాళులపాకయన్నయ వచోనూత్నక్రియల్ చెన్నగున్

అని శ్రుతుల కిచ్చిన ప్రాధాన్యం స్పష్టం చేశారు. వేదాలను మన్నించిన అన్నమయ్య తనసంకీర్తనలలో వేదమంత్రాలను, వేద మంత్రార్థాలను విశదీకరించినసందర్భాలెన్నో ఉన్నాయి. వీటిలో కొన్నిటిని మా గురువర్యులు శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారు అన్నమాచార్యుల అధ్యాత్మసంకీర్తనల పీఠికలలో, ఆలాగే నా పర్యవేక్షణలో పిహెచ్.డి; సిద్ధాంత గ్రంథం సమర్పించిన శ్రీమతి డా॥వి.ఇంద్రాణిగారు "తాళ్లపాక అన్నమయ్య వైదుష్యము- ఒక పరిశీలన"లో వివరించారు.

వైష్ణవదీక్షస్వీకారంలో (సమాశ్రయణంలో) పంచ సంస్కా రాలలో 'తాపః' ఒకటి – ముద్రాధారణం. రెండు భుజాలమీద శంఖచక్రాలు కాల్చి, ముద్రించుకోవడం. ఇది వేదసమ్మతమా కాదా అనే సందేహాలు అన్నమయ్యకాలంలో ఉండేదేమో! వారినోరు మూయించదానికోసమో ఏమో అన్నమయ్య ఒక కీర్తన వ్రాశాడు. ఆ కీర్తనలో వేదమంత్రాలను యథాతథంగా ఉటంకించాడు.

